

నాట్యకర్త్రి : మృణ్మయ ఫలకచిత్రం, శిల్పి శ్రీ యం. సూర్యనారాయణగారు, మద్రాసు.



# విషయానుక్రమణిక

## 1951 అక్టోబరు 31







# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder : K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 9
31.10-51

ఖర సంవత్సర కార్తీక బహుళ శుద్ధ పాడ్యమి బుధవారము


# బ్రిటిష్ ఎన్నికలు: చర్చిల్ విజయం

బ్రిటన్‌లో అక్టోబరు 25 వ తేదీన జరిగిన ఎన్నికలలో చర్చిల్ పార్టీకి (కన్సర్వేటివ్ పార్టీ) విజయం లభించింది. పార్లమెంటులోని 625 స్థానాలలోనూ, 318 స్థానాలను చర్చిల్ పార్టీ గెలిచింది. లేబర్ పార్టీ 293 స్థానాలు గెల్చింది. లిబరల్స్ 5 స్థానాలనూ తదితరులు 8 స్థానాలనూ మాత్రం సంపాదించారు. (ఇంకా ఆరు స్థానాలకు ఫలితం తెలియాలి.) అట్లీ ప్రభుత్వం శుక్రవారం నాడు రాజీనామా నిచ్చింది. చర్చిల్‌ను మంత్రివర్గం నిర్మించవలసిందని జార్జిరాజు ఆహ్వానించాడు.

1950 లో మాదిరిగానే ఇప్పుడూ లేబర్ పార్టీ కన్సర్వేటివ్ పార్టీలు సమ ఉజ్జీలుగానే ఉన్నాయి. అయితే మిగిలిన పార్టీలు బొత్తిగా బలహీనపడిపోయినందువల్ల, కిందటి ఎన్నికలలో వారికి పడిన వోట్లలో చాలభాగం ఈ మారు కన్సర్వేటివ్ పార్టీ పక్షాన వెయ్యబడినాయి. 1950 ఎన్నికలలో 25 లక్షల వోట్లు లిబరల్ పార్టీకి పడినాయి. అప్పుడు 475 మంది అభ్యర్థుల్ని ఆ పార్టీ నిలబెట్టింది. 1951 అక్టోబరు ఎన్నికలలో 109 మందిని మాత్రమే నిలబెట్టగలిగింది. కిందటి ఎన్నికలలో నూరుమంది అభ్యర్థుల్ని నిలబెట్టిన కమ్యూనిస్టుపార్టీ ఈ మారు పదిమందినే నిలబెట్టింది. లిబరల్ పార్టీకి కిందటి ఎన్నికలలో పడిన 25 లక్షల వోట్లలోనూ ఈ మారు ఎన్నికలలో దాదాపు 20 లక్షలవోట్లు లేబర్ పార్టీ కన్సర్వేటివ్ పార్టీలకు పడినాయి. వీనిలో అత్యధిక భాగం కన్సర్వేటివ్ పార్టీకి పడినందువల్ల తమకు పరాజయం సంభవించిందని లేబర్ పార్టీ నాయకులన్నారు

గత అరవై ఏళ్లుగా బ్రిటన్‌లో ఏ ఒక్క పార్టీ గాని వరుసగా మూడు ఎన్నికలలో గెలిచినది లేదనీ (1910 లో లిబరల్ పార్టీ మినహా) అందువల్ల ఈ మారు కన్సర్వేటివ్



చర్చిల్

పార్టీకి విజయం తప్పదనీ లండన్ 'టైమ్స్' పత్రిక ప్రత్యేక విలేఖరి గత మాసంలో వ్రాశాడు.

ఆరేళ్ల లేబర్ పార్టీ పరిపాలన అనంతరం ప్రజలు విసిగిపోవడం సహజమే. ఈ నాడు అమెరికా రష్యాలు మినహా ఆర్థిక దుర్భిక్షానికి లోబడని దేశమంటూ ప్రపంచంలో లేదు. అందువల్లనే రెండేసి బలీయమైన పార్టీలు పోటీచేసిన దేశాలలో (ఆస్ట్రేలియా న్యూజిలాండ్ మొదలైనవి) ప్రభుత్వాలు మారినాయి.

ఆర్థికస్థితి నానాటికి క్లిష్టతర మౌతున్నందువల్లనూ, బ్రిటన్‌లో లేబర్ ప్రభుత్వం ఆయుధ పునర్నిర్మాణానికి మూడేళ్లలో 470 కోట్ల పౌనులు ఖర్చు పెట్టాలని ఎలాగూ నిశ్చయించింది కనుకనూ, ఇంక బ్రిటన్ సైనికంగా బలపడ్డానికి లేబర్ ప్రభుత్వంకంటె చర్చిల్ ప్రభుత్వమే మేలని ఇరవై లక్షల మంది లిబరల్ పార్టీ పక్షపాతంకల వోటర్లు భావించి ఉండవచ్చును.

ఇదీగాక సరిగ్గా ఎన్నికల సమయానికి బ్రిటిష్ ప్రభుత్వం అతిక్లిష్టమైన సమస్యల నెదుర్కొనవలసి వచ్చింది. రానున్న శీతకాలంలో బొగ్గు కరువు బాధ అధికంగా ఉంటుందని బ్రిటన్‌లో ప్రజలందరూ భీతి చెందుతున్నారు. దీనికి కారణం లేబర్ ప్రభుత్వం స్వాధీనపరుచుకున్న బొగ్గు గనుల్ని సమర్థతతో నిర్వహించలేకపోవడం వల్లనేనని ప్రజలు భావిస్తున్నారు. రాజనీతిజ్ఞతలోనూ, తంత్రజ్ఞతలోనూ అసమర్థులైనందువల్లనే లేబర్ పార్టీ మంత్రులు పర్షియన్, ఈజిప్షియన్ సమస్యల్ని పరిష్కరించలేకపోయినారని కన్సర్వేటివ్ పార్టీవారు, లిబరల్ పార్టీవారు ప్రచారం చేశారు. వీనికితోడు లేబర్ పార్టీలోని బెవాన్ వర్గం ఆయుధనిర్మాణ కార్యక్రమాన్ని ప్రతిఘటిస్తున్నది. ఈ హేతు

పులు కూడా లేబర్ పార్టీ పరాజయానికి దారితీసి ఉండవచ్చును.

బ్రిటనులో చర్చిల్ ప్రభుత్వ స్థాపనతో పరిపాలనావిధానంలో పెద్దమార్పు లుండ గల అవకాశం ఉంది. పర్షియానుంచి బ్రిటిష్ నిపుణులను తరలించడం ప్రభుత్వ అసమర్థతే నని చర్చిల్ అన్నాడు. భారత దేశానికి స్వాతంత్ర్య మిచ్చినప్పుడు చర్చిల్ ప్రతిఘటించాడు. బ్రిటనులో ఉక్కు పరిశ్రమను ప్రభుత్వాధీనం నుంచి తొలగించి తిరిగి పెట్టుబడిదారులకు ఒప్ప గించగలనని చర్చిల్ ఎన్నికల సమయంలో తెలిపాడు.

ఇక్కడ మరొక విషయాన్ని చెప్పడం అవసరం. అట్లీ ప్రభుత్వం అవివేకంవల్ల ఆయుధనిర్మాణ కార్యక్రమం విఫలమై పోతున్నదనీ, బ్రిటిష్ దేశానికి నష్టంప్రాప్తి స్తున్నదనీ కన్సర్వేటివ్ లు ప్రచారం చేస్తు న్నారు. ఆయుధ బల నిర్మాణంవల్ల అమెరి కాలో పారిశ్రామిక యజమానులకూ కంట్రాక్టరుకూ కని విని ఎరుగనంతటి లాభాలు కురిసి పోతున్నాయి. కాని బ్రిటన్ లో ఇదే కార్యక్రమంవల్ల బ్రిటిష్ పారిశ్రామికులకు, కంట్రాక్టరుకు అంతపెద్ద పెట్టున లాభాలు రావడం లేదంటే, అట్లీ ప్రభుత్వ విధానాలే కారణమని బ్రిటన్ లో ధనికవర్గాలవాదన. అందువల్ల బ్రిటన్ లో సోషలిస్టు ప్రభుత్వం తొలగిపోయి, చర్చిల్ ప్రభుత్వం వచ్చినట్లయితే, ఆయుధ బల నిర్మాణ కార్యక్రమం సక్రమంగా కొన సాగగలదనీ, ధనిక వర్గాల వారికి లాభాలు మరింత అధికంగా రాగలవనీ ఆశిస్తున్నారు. నిజానికి ప్రపంచ ఆర్థిక పరిస్థితుల్నిగాని మాకు సరకుల ధర్లనిగాని గమనించినట్లయితే, ధనికవర్గాల లాభాలకు లోటు రాకపోయినా, ఆయుధ బల నిర్మాణ కార్యక్రమం సక్రమంగా కొనసాగడం సాధ్యంకాదని సందేహం కలుగుతుంది.



ఢిల్లీలో ఇండో-బర్మా వ్యవహారాలకు చర్చిస్తున్న బర్మాప్రధాని థాకిన్ నూ, పండిట్ నెహ్రూలు.



భారతదేశంలో లాయ్ హెండర్సన్ స్థానే అమెరికన్ రాయబారిగా నియమితుడైన చెస్టర్ బౌల్స్ ఆయన కుటుంబం.

విదేశాంగ విధానాన్ని వివరిస్తూ చర్చిల్ తాను స్టాలిన్ తో సమాలోచనలు జరిపి యుద్ధ ప్రమాదాన్ని నివారించడానికి యత్నించగలనని చెప్పాడు. అయితే రష్యాతో దురాక్రమణ ప్రమాదంనుంచి కాపా డుకోడానికి ఆయుధనిర్మాణం విషయమై లేబర్ పార్టీతో చర్చిల్ ఏకీభవించాడు, బలాన్ని చేకూర్చుకుని అప్పుడు రష్యాలో రాయబారాలు జరిపితే ఫలిస్తాయని అట్లీ

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 70

వేజర్ కావల్కాంటీ చల్లగా ఇటలీ చేరుకుని ద్రవ్యాన్ని జూదంలో వెచ్చించ నారంభించాడు. అండ్రీ కావల్కాంటీ డాంగ్లర్ ఇంటిలో తరుచు దర్శన మివ్వడం ప్రారంభించాడు కౌంట్ బిరుదు పెట్టుకుని అపారంగా ధనం వెచ్చిస్తున్న అండ్రీని చూసి అతను కోటీశ్వరుని కుమారుడై ఉంటాడని డాంగ్లర్ భావించాడు.

ఒకనాడు అండ్రీ డాంగ్లర్ ఇంటిలో మన్ననలు పొందుతున్న సమయంలో మాంట్ క్రిస్టో వచ్చాడు. డాంగ్లర్ కుమార్తె యూజినీ కొంతసేపు అక్కడున్నట్లే ఉండి, ఎవరూ గమనించని సమయంలో తన గదిలోకి జారుకుని పియానో వద్దకు చేరింది. కొంతసేపటికి అది గమనించి డాంగ్లర్ స్వయంగా అండ్రీని ఆ గదిలోకి తీసుకువెళ్లి "అమ్మాయి! ఈయన చక్కగా పాడగలడు ఎప్పుడైనా విన్నావా?" అన్నాడు. కుమార్తె సమాధానం చెప్ప లేదు. ఆమె ముఖం చూస్తే రూక్షభావం మాత్రం కనపడింది. డాంగ్లర్ అది గమనించనట్లే అండ్రీని అక్కడ విడిచిపెట్టి సావడిలోకి వచ్చాడు. వచ్చేసరికి వాలంటిన్ ఫ్రాంజ్‌ల సంబంధం విచ్ఛిన్నమైపోయిన సంగతి సొర్కినా డాంగ్లర్ మాంట్ క్రిస్టోతో ఏకరువు పెడుతోంది.

"పెళ్లికి ఒప్పుకోకపోయిం దెవరు?" అన్నాడు డాంగ్లర్ వచ్చి.

"ఫ్రాంజ్."

"చిత్రంగా ఉందే!" అన్నాడు మాంట్ క్రిస్టో. "అయితే అండ్రీ ఏడీ?"

"మా అమ్మాయితో కలిసి సంగీతసాధన చేస్తున్నాడు. అయితే ఆయన నిజంగా ఇటలీ రాజవంశానికి చెందినవాడేనా?" అన్నాడు డాంగ్లర్.

మాంట్ క్రిస్టో శంకాభావంతో డాంగ్లర్‌ని పరికించాడు. "అదేమో నేను రూఢిగా చెప్పలేను. నా మిత్రుడొకడు అతని తండ్రిని నావద్దకు పంపాడు. కాని మీరు చేస్తున్న పనేమిటి? ఇది ఆల్బర్ట్‌కి తెలిస్తే కలహం రాదా?"

"ఎందుకు వస్తుంది? అతనికి నాకూతురు పట్ల ఎన్నడూ నిజమైన ప్రేమలేదు. నిర్లక్ష్యభావంతో ఉంటాడు. నేనూ అతని కోపతాపాల్ని లక్ష్యపెట్ట నవసరంలేదు."

"అయినా, మీరొకసారి మాట ఇచ్చారు కదా?"

"ఇచ్చిన మాట నిజమే. కాని ఆల్బర్ట్‌కి ప్రేమలేకపోయిన తరవాత నేను ఆమాట పాటించనవసరంలేదు. అండ్రీతో పోలిస్తే ఆల్బర్ట్ ఎంతటివాడు? అండ్రీ భాగ్యవంతుడు, వినయగుణ సంపన్నుడు."

"కాని నాదృష్టిలో అన్నిటా ఆల్బర్ట్ మేలైనవాడు."

"అయితే అండ్రీ ఎందులో తక్కువవాడో మీరే చెప్పండి."

"తక్కువేమీ లేకపోవచ్చును కాని ఆల్బర్ట్ నామిత్రుడు."

డాంగ్లర్ పకపక నవ్వాడు. "అబ్బే ఇటువంటివి నిత్యం జరిగేవే. అయితే కౌంట్ మార్సెర్ఫ్ మళ్ళీ ఎందుకడగలేదా విషయం? ఆయన వచ్చి నన్ను అడగడం ఆచారం, ఆమాట మీరైనా ఆయనతో చెప్పకూడదూ?"

"మీరు కోరితే చెప్తాను"

"అవును కోరుతున్నాను. ఆయనతో చెప్పండి."

ఇంతలో డాంగ్లర్‌కు పిలుపు వచ్చింది. "ఇప్పుడే ఎవరో చూసివస్తాను ఉండండి" అంటూ డాంగ్లర్ వెళ్లాడు. వెళ్ళిన పది నిమిషాలలో తిరిగి వచ్చి మాంట్ క్రిస్టోతో "చూశారా? మీరిచ్చిన సలహా చక్కగా పనిచేసింది. ఇప్పుడే జనీవానించి నాకు లేఖ వచ్చింది. అక్కడ ఫిర్నాండోకి సంబంధించిన కథ చాలా ఉంది. అదంతా సావకాశంగా మీకు చెప్తాను."

"తప్పకుండా. ఇంక నేను వెళ్లాలి" అంటూ మాంట్ క్రిస్టో చిరునవ్వుతో లేచాడు.

మాంట్ క్రిస్టో ఇంటికి చేరే సరికి అక్కడ ఆల్బర్ట్ నిరీక్షిస్తున్నాడు. ఇద్దరూ కూర్చోగానే ఆల్బర్ట్ అన్నాడు. "మీరు డాంగ్లర్ ఇంటివద్దనుంచి వస్తున్నారుకదూ? అండ్రీ..."

"ఆగు." అన్నాడు మాంట్ క్రిస్టో శ్రద్ధగా ఆలకిస్తూ. లోపల నుంచి సన్నగా ఘుజ్ లా వినవస్తోంది ఆల్బర్ట్ కూడా క్షణం సేపు ఆలకించి, "కౌంట్ ఎవరిదా సంగీతం? అపూర్వంగా ఉంది సుమా!"

మాంట్ క్రిస్టో కొద్దిసేపు ఆగి అన్నాడు. "హైదీ!"

"హైదీ! ఎంత చక్కని పేరు."

"ఇశ్! మెల్లిగా అను. ఆమెకి వినపడుతుంది."

"వింటే ఆమె కోపగిస్తుందా?"

"కోపమా? ఆమె కోపగించదు. ఆమె నా బానిస."

"మీ అధీనంలో బానిస అంటే మా దేశంలో ఉన్నత పదవి. ఆమె రాజ వంశాలకు చెందినదా?"

"అవును."

"ఆమె చరిత్ర రహస్యమా?"

"అవును. రహస్యమే. కాని నీకుమాత్రం కాదు. నీవద్ద నేను దాచగల రహస్యాలు లేవు ఆల్బర్ట్. కాని నీకు తెలిపే రహస్యాల్ని కాపాడగలవా?"

"ప్రమాణం తీసుకుంటాను."

"నీకు జెనీనా పాషాను గురించిన చరిత్ర తెలుసుకాదూ?"

"పాషాకు హైదీ ఏమౌతుంది?"

"కుమార్తె."

"ఆమె మీ దగ్గర బానిసా!"

"అవును. ఆమెను కాన్‌స్టాంటినోపిల్ నగరంలో కొన్నాను."

"ఆమెను నేను చూడవచ్చునా?"

"రెండు షరతులమీద."

అనువాదం: సీతారామ్

"నాకు సమ్మతమే."

"మొదటి షరతు, ఆమెను నువ్వు చూసినట్లు ఎవరికీ తెలియ పరచనని ప్రతిజ్ఞ తీసుకోవాలి."

"తప్పకుండా."

"రెండో షరతు, నీ తండ్రి ఆమె తండ్రివద్ద ఉద్యోగం చేసిన సంగతి ఆమెకి చెప్పకూడదు."

"సమ్మతమే."

"అయితే రా."

"ఆల్బర్ట్ మాంట్ క్రిస్టోని అనుసరించాడు. ఇద్దరూ హైదీనివాసం ప్రవేశించారు. ఆ నివాసమంతా గ్రీక్ రాజాంతఃపురంవలె అలంకరించబడింది. హైదీ ఇద్దరినీ గౌరవపురస్సరంగా ఆహ్వానించింది, మాంట్ క్రిస్టో పట్ల భక్తిభావమూ, ప్రేమభావమూ, ఆమె విశాల నీల నేత్రాలలో సువ్యక్తమౌతున్నాయి. ఆల్బర్ట్ ద్వారంవద్దనే నిలిచి నిశ్చేష్టుడై ఆమెను పరికించ నారంభించాడు. ఇంతటి అపూర్వ సౌందర్యవతిని ఎన్నడూ చూడలేదనుకున్నాడు ఆల్బర్ట్.

హైదీ ప్రశ్నార్థకంగా మాంట్ క్రిస్టోవంక చూసింది.

"నామిత్రుడు, ఆల్బర్ట్. ఇతనినే రోమ్‌నగరంలో దొంగల బారినుంచి నేను తప్పించాను."

హైదీ అభివాదం చేసింది. ఆల్బర్ట్ ప్రత్యభివాదం చేశాడు. ముగ్గురూ సోఫాలలో ఆసీనులైనారు. ఆల్బర్ట్ తడబడు తున్న మాటలతో ఇలాఅన్నాడు: "నేనీ క్షణంలో పారిస్‌నగరంలో ఉన్నట్లు లేదు సుమా? ఎక్కడో తూర్పు దేశాలలో ఏ రాజాంతఃపురంలోనో ఉన్నట్లుంది. నేనీదృశ్యాన్ని నాజన్మలో మరిచిపోలేను."

తరవాత హైదీ వంక తిరిగి "మీచరిత్ర నాకు చెప్పగలరా?" అన్నాడు.

హైదీ మాంట్ క్రిస్టో వంక చూసింది. "చెప్పు" అన్నాడు మాంట్ క్రిస్టో. తరవాత గ్రీక్ భాషలో "కాని నీ తండ్రి పట్ల ద్రోహం చేసిన వ్యక్తి పేరు మాత్రం చెప్పవద్దు"అన్నాడు.

హైదీ ఆలోచనలో పడింది. కొంతసేపు నిరీక్షించి ఆల్బర్ట్ అడిగాడు "మీరు మీదేశాన్ని విడిచిపెట్టి ఎంత కాలమయింది?"

"అయిదేళ్ల వయస్సున్నప్పుడు నా మాతృభూమిని కడసారి చూశాను."

"మీరు మాతృభూమి నెందుకు విడిచి పెట్టవలసి వచ్చింది?"

"అదంతా పెద్ద కథ."

"నాకు వినాలని కుతూహలంగా ఉంది."

"అదంతా నిన్న జరిగినట్లుంటుంది. అప్పుడు నాకు నాలుగేళ్ళు. ఒకరోజు రాత్రి మా అమ్మ నన్ను నిద్ర లేపింది. నాకు పూర్తిగా మెలకువ రాకముందే ఎత్తుకుంది. ఆమె ముఖంలోకి చూశాను. కళ్ల నీళ్ళు ధారలు కట్టి కారుతున్నాయి. నన్నెత్తుకుని గబగబ మేడమెట్లు దిగింది. మా వెనకనే పరిచారికలందరూ సామాన్లు సర్ది విలువైన ఆభరణాలు మొదలైనవి సంచులలో కట్టి తెస్తున్నారు. అంతా కల్లోలంగా ఉంది. అందరి వెనుకా ఇరవై మంది సిపాయిలు తుపాకులు చేతబట్టి వస్తున్నారు. రాత్రి వేళ దీపాల వెలుగులో గోడలపైన నీడలు భీభత్సంగా తాండవం చేస్తున్నాయి.

"త్వరగా" అన్నాడొక సిపాయి. అందరూ భయంతో అతని ఆజ్ఞల్ని నిర్వర్తిస్తున్నారు. నేను గజ గజ వొణికి పోతున్నాను. కొంతసేపటికి కాని నేనా సిపాయిని గుర్తుపట్టలేదు. ఆయన నా తండ్రి. జెనీనా ప్రాంతానికి పాషా, అలీ టెబలీన్. ఆయనపేరు చెప్తే టర్కీ సామ్రాజ్యం గజగజ లాడిపోయేది."

ఈమాటలు చెప్తున్నప్పుడు హైదీ గంభీర భావమూ, అహంకారమూ గమనించి ఆల్బర్ట్ స్తంభితుడైనాడు.

"త్వరలోనే మేమందరం ఒక సరస్సుఒడ్డుకి చేరాం. ఒడ్డున నీటిలోకి నాలుగు పాలగచ్చు మెట్లున్నాయి. మెట్లవద్ద నీటిపై ఒక చిన్న బోటు తేలుతోంది. దూరాన సరస్సు మధ్యలో నల్లని ఛాయ కనపడుతోంది. అది సరస్సులో నిర్మించబడిన చిత్రమైన గృహం. అజ్ఞాతవాసంకోసం నాతండ్రి అదినిర్మించాడు.

అందరం బోట్లెక్కాం. ఎక్కగానే అతి వేగంతో బోట్లు నీటిపై తేలి పరుగెత్త నారంభించాయి. నాకు భయం కలిగింది. 'ఇంతవేగంగా పోతున్నా మెందుకు నాన్నా?' అని నా తండ్రిని అడిగాను. 'ఇస్! ఊరుకో అమ్మా, మనం పారిపోతున్నాం. ఇంక తలదాచుకోవాలి.' అన్నాడు. నాకది అప్పుడు అర్థం కాలేదు. నాతండ్రి పారిపోవడమా? ఆయన పేరుచెప్తే అందరూ పారిపోయేవారు. ఆయనే పారిపోయి తలదాచుకోడమా?

"తరవాత నాకా విషయమంతా బోధపడింది. జెనీనా రాజాంతఃపురాన్ని కాపాడుతున్న సైన్యం అలసిపోయింది. నా తండ్రిని బందీచేసి తీసుకురావలసిందని టర్కిష్ సుల్తాన్ ఒక సైన్యాధిపతిని పంపాడు. నా తండ్రి అతనితో పోరాడి చివరికి రాయబారాని కంగీకరించాడు. తన తరఫున తనకింద ఉద్యోగం చేస్తున్న ఫ్రెంచిసైనికాధికారి నొకనిని పంపాడు. పంపి తానింక ఇదివరకే ఏర్పాటుచేసుకున్న సరస్సులోని కోటలో తలదాచుకోవాలని పారిపోయాడు.

"సరస్సులోని కోట పై మిద్దె మాత్రం నీటి పైకి కనపడుతుంది. మిగతా కోట అంతా నీటిలో మునిగి ఉంది. అందులో రెండు అంతస్తులున్నాయి. ప్రాకారానికి లోపల; మిద్దె పైనా ఫిరంగులు అమర్చబడినాయి. నా తల్లిని నన్ను, కొందరు స్త్రీలను లోపలికి పంపారు. అక్కడే అరవై వేల సంచుల రెండున్నర కోట్ల బంగారు నాణేలు, ముప్పైవేల పౌనుల తుపాకి మందు దాచబడినాయి. దీనివద్ద నాతండ్రికి విశ్వాసపాత్రుడైన సిపాయి సలీమ్ కాపలా ఉంచబడ్డాడు. ఒక శూలానికి చివర గుడ్డచుట్టి కాగడా వెలిగించి పట్టుకుని రాత్రి పగలు సలీమ్ కాపలా కాస్తున్నాడు. తాను సంకేతమివ్వగానే తుపాకిమందుకు నిప్పుముట్టించి, కోటను ధ్వంసం చేసెయ్యాలని నాతండ్రి సలీమ్‌కి ఆజ్ఞ ఇచ్చాడు. అందులో స్త్రీలందరితోపాటు తానూ నాశనమై పోవాలని నా తండ్రి సంకల్పం. నా తండ్రి మిద్దెపై కూర్చుని సరస్సుచుట్టూ చూస్తున్నాడు. అలా ఎంతసేపున్నామో నాకు తెలియదు. నా తల్లి అతని మోకాలిపై తల ఆనించి పాదాలవద్ద కూర్చుంది. నేను ప్రక్కనే కూర్చుని సరసులోని నీటల్ని చూస్తూ కాలం గడిపాను. ఆ దృశ్యం ఇప్పటికీ నాకు కళ్ళముందు కట్టినట్లుంది. దూరాన, సరస్సు నీటి కావల జెనీనా కోట బురుజులు కనపడుతున్నాయి.

"అలా ఎన్నిరోజులున్నామో నాకు గుర్తులేదు. ఒక రోజు ఉదయం నాతండ్రి నన్నూ అమ్మనూ పిలిచాడు. మా అమ్మ ఆరాత్రి అంతా దుఃఖిస్తూ కూర్చున్నందువల్ల ఆమె కన్నులు ఎర్రగా ఉన్నాయి. నా తండ్రి ముఖం పాలిపోయి ఉంది. అయితే గాంభీర్యమూ, ప్రశాంతతా ఉట్టిపడుతున్నాయి. 'ధైర్యం తెచ్చుకోవా పిరికీ' అన్నాడు మా అమ్మతో, 'ఇవాళే సుల్తాన్ ఫర్మానా వస్తుంది. ఫ్రెంచి సైనికోద్యోగి వస్తాడు. నన్ను సుల్తాన్ క్షమిస్తే

(43-వ పేజీ చూడండి)

# విలపించే సత్యం

"శివం"

తెల్లవారితే రేపను బియ్యం తేవాలి; జీతండబ్బులు అయిపోయినాయి. తను పడుకొని ఆలోచిస్తున్నాడు ఎట్లాగా అని. అవతల వాటాలోంచి హృదయం అవిసేట్లు ఏడుస్తున్నాడు రాముడు.

అవతలివాటాకి, యివతలి వాట్వాకు మధ్య చిల్లులు పడ్డ తడిక అడ్డము. తడిక అవతలనుంచి రాముడు గుక్కపట్టి ఏడుస్తూనేవున్నాడు. ఎవరూ అడగరేమిటి వాడిని ఎందుకని.

వంటింటిలోనుంచే వారి తల్లి అంటోంది "ఏమిటి బాబు, ఏమిటి? ఎందుకు?" అని. ఒక్కక్షణం ఆగి, దగ్గి మళ్లీ ఏడువసాగేడు సత్యం కొడుకు, రాముడు.

రేపు వుదయమే, లేవగానే వెంకట్రావు దగ్గిరకెళ్లి నాలుగు రూపాయలు అప్పు అడగాలి. ఇస్తే వాడే ఏమైనా యివ్వాలి. ఇంతో అంతో పైన సంపాదిస్తూండే వాడివ్వలేకపోతే యింకెవరిస్తారు తనకి.

"కడుపులో నొప్పేమోనే? డాక్టరుకు చూపించడేంరా అని రెండు నెలలనుంచీ మొత్తుకుంటూన్నా నామాట వింటాడు కాడు వాడు," రాముడి అమ్మమ్మ కాబోల్ను అంటోంది.

"ఏం నాన్నా... మంచి నీళ్లిచ్చేదా... పోన్లే...ఎక్కడ నొప్పి... చెప్పుబాబూ." సత్యంభార్య అంది చాలా శాంతంగా.

రాముడు ఏడుస్తూనే వున్నాడు! నానాలు గేళ్లకుర్రాడు ఏంచెబుతాడు? వాడికి కడుపులో లివరు అనీ, డాక్టరుకి చూపించమనీ అంతా చెప్పేరు? అట్లాగే అంటాడు కాని సత్యం, ఎప్పుడూ డాక్టరుకి చూపించడు వాడిని. 'సరేలే' అంటాడు డబ్బులేవనడు సత్యం.

మరచిపోయేడు తను. వెంకట్రావు తనకి యింకా ఏం అప్పిస్తాడు? రేపటినుంచీ సెలవ పెట్టేడు-ఇవ్వేళ సాయంత్రమే వాళ్ళ అత్తారివూరుకు బండెక్కి వుంటాడు. ఛీ! అన్నీ యిప్పుడే వస్తాయి. మరెవరినన్నా అప్పిచ్చేవాడిని పట్టకోలి ప్రొద్దున్నే. కాని ఎవర్ని?

"రామ, రామ! చెవులు పగిలిపోతున్నాయి!"

వాడిని కొన్నేపు చల్లగాలిలో అయినా త్రిప్పండ్రా......వూరుకుంటాడేమొ?" రాముడి తాతగారు బయట కుక్కిమంచంలోంచి అంటున్నారు.

రాముడు ఒక్కక్షణం ఆగి తిరిగి అందుకున్నాడు. మానవుల బాధంతా తనదే నన్నట్టు హృదయ విదారకంగా వున్నదా రోదన, ఎంత బాధో? ఏమి బాధో!

"ఏమీ తెలియకపోతే తెలియనట్లు వూరుకోండి మీరు. గాలిలేక ఏడుస్తున్నాడుట! మరీ శోద్యం మీది. లోపల ఏం బాధో..." మధ్య గదిలోకి వచ్చి గట్టిగా అంది రాముడి అమ్మమ్మ.

"వాళ్ళ నాన్నగారొచ్చే వేళయ్యింది. ఆయన కొన్నేపు ఎత్తుకుంటే వాడే వూరుకుంటాడు." అని పెరట్లోకి వెళ్ళిపోయింది రాముడి తల్లి.

తాతగారు సకిలిస్తున్నారు. రాముడు ఏడుస్తూన్నాడు. తను ఆలోచిస్తున్నాడు. ఎవరిని అడిగేది ప్రొద్దున్నే అప్పు?

బూట్లు చప్పుడు చేసుకుంటూ సత్యం వచ్చేడు. ఎవరితోనో అంటూన్నాడు "క్రిందటిసారి తప్పకుండా వస్తావనుకున్నా మామయ్యా... ఈసారైనా తప్పించుకునే వాడివే నేను చూసి పట్టుకోనకపోతే."

"ఏం చేసేదిరా? ఎప్పటికప్పుడు అనుకోడమే. ఎవరూ ఏడుస్తూంట...మీ రామ ఏమిటి?"

"ఆ. వాడే. ఏం బాబూ... చూడు మామయ్య వచ్చేడు... అమ్మోయి మామయ్య వచ్చేడేవ్... నేను చూచి పట్టుకుంటేను...బీదవాళ్ళం మన యింటికి ఎందుకు వస్తారులే... కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యి..."

"కులాసాయేనా...ఫర్వాలే అలా కడుక్కోవచ్చు." అంటోంది సత్యం తల్లి.

"ఆ. కులాసాయే. బావ వంట్లో ఎట్లా వుంటోంది. యిక్కడ పెట్టనా యీ చెంబుని."

"ఆ. అలా వుంచండి. ఏదో యిట్లా వుంటున్నా......మీ వూళ్ళో దోమలున్నాయా బావా!" అంటూనే దగ్గసాగేడు సత్యం తండ్రి.

మధ్యగదిలో సందడి తగ్గింది.

వంటింట్లో సందడి హెచ్చింది. రాముడి బాధలో హెచ్చూ లేదు, తగ్గూ లేదు, అట్లాగే ఏడుస్తూన్నాడు వాడింకా.

తను ఆలోచిస్తున్నాడు అప్పు ఎక్కడ దొరుకుతుందా తెల్లారీ అని. ఇవ్వేళనే దొరకవలసింది అసలు. ఒక్క అరగంట ఆలస్యమయింది...దొరకవలసిన పెద్దమనిషి దొరికేసరికి. ఈలోగానే సత్యం వొచ్చి బ్రతిమాలడం, ఆ పెద్దమనిషి అతనికి ఆ పది రూపాయలు అప్పుయిచ్చేయటం జరిగిపోయింది. ఈ సత్యం వకడు మధ్య సైంధవుడిలాగ. రేపు ప్రొద్దున్న ఎవరినో వకరిని పట్టకోలి.

"ఏమిటో! ఎందుకొచ్చిన శ్రమ యిదంతాను. హాయిగా ఏ హోటల్లోనో తినేసే వాణ్ణి...యిట్లాలాక్కుని వచ్చేవు నన్ను." అంటూన్నాడు అవతల వాటాలోంచి బంధువు.

"మేమింకా యిక్కడ బ్రతికుండగానే హోటలు రాతేమిటి మామయ్యా! రేపు మేము మీ వూరొస్తే మీ యింటికి రావద్దనేగా?"

"ఆ. చాదస్తం."

"ఊరుకోరా బాబూ! ఊరుకో. రేపు పొద్దున్నే నాన్న చాక్లెట్లు కొని తెస్తారుగా. ఊరుకో." అంటూంది సత్యం తల్లి.

"రామ రామ. ఏమిటీ పాడు గోల." అంటూన్నాడు రాముడి తాతగారు.

రాముడు ఏడుస్తూనే వున్నాడు రాళ్ళు కరిగేటట్టు.

తనలాగే చాలీ చాలని జీతం సంపాదిస్తున్న సత్యాన్ని గూర్చి ఆలోచించిన కొద్దీ తనకి, మానవుడికి తోటిమానవుడి

(40-వ పేజీ చూడండి)

# గగనకుసుమం

'పంతులూ! పంతులుగారోయ్!...' వెనకనించో మొరటు కంఠం చేతి చప్పట్ల సహాయంతో పరుగిడుతూ వచ్చి నా చెవుల్ని తాకింది.

వెనక్కి తిరిగి చూచేను. సెట్టిగారి యింటి గుమ్మంమీద నుంచొని రామిగాడు చెయ్యూపుతున్నాడు రమ్మని.

నన్నేనా? బలే ఆశ్చర్యం వేసింది నాకు. నుంచొని ఇంకెవర్నైనా పిలుస్తున్నాడేమోనని నాలుగువేపులా పరికించి చూచేను. ఎవ్వరూ లేరక్కడ నేను తప్ప. ఇంత మండుటెండలో-ఇలాంటి సందులో ఇటువంటి సమయంలో నడవడానికింకెవరు సాహసిస్తాడు, నాలాంటి విధిలేని దౌర్భాగ్యుడు తప్ప.

రామిగాడి చేతి ఊపులవేగం ఎక్కువౌతోంది-తొందరగా రమ్మని సంజ్ఞచేస్తూ-ఇంటి లోపలికి వ్రేలుచూపుతూనూ. తప్పకుండా అది నన్నుద్దేశించే. సెట్టికాబోలు నన్ను పిలిపిస్తోంది. ఈ నిర్భాగ్యదామోదరునితో ఆ అగర్భ శ్రీమంతుడికి అవసరమేం కలిగింది చెప్మా! కనపడ్డప్పుడు నమస్కారం చేస్తే చూపులు కలియని వ్రేలి ఊపుతో మాత్రమే అందుకొనే పెద్దమనిషికి ఈనాడు నాతో మాటాడవలసిన అవసరపు పనేం కలిగిందో?. రూపాయలగలగలే గాని పాపాయిల కలకలలేని యిల్లాయె ఎవరికైనా ప్రయివేటు చెప్పించడానికి పిలుస్తున్నాడని తలంచడానికైనా-ఆలోచనలకి అంతు చిక్కలేదు. అక్కడే నుంచుండిపోయ్యేను కొయ్యబారి; కాలుతూన్న కాళ్ల మొరైనా వినకండా.

'బాబుగారికి మీతో మాటాడాల్సిన పనేందో ఉందంట. ఒక్కసారి దయచెయ్యండి.' రామిగాడు రానే ఒచ్చేడు దగ్గరకు. నన్ను స్వయంగా తీసుకెళ్లడానికి.

సరిగ్గా పన్నెండు గంటలు. ఎండవేడి జాస్తిగా ఉంది. వేడెక్కిన ప్రకృతి నా స్వేదజలంతో దాహశాంతి చేసుకోవడానికి ప్రయత్నిస్తోంది. వేసవికాలం. నెత్తిపై చినిగిన గొడుగు. కాలం గడచి-ముడుతలు పడి-విశ్రాంతిదశ ఏనాడో దాటిన తమ్ము నిర్దాక్షిణ్యంగా ఉపయోగించుకుంటున్నప్పటికీ నా చెప్పులు మాత్రం నా యందు సేవ్యసేవక భావం చింతించో లేక నాదుర్దశ వలన పొందిన జాలిచేతనో నా కాళ్లను అంటి వదలక ఎండబాధనుండి కొద్దిగా రక్షిస్తోంది. కడుపులో కాలుతోంది. ప్రొద్దున్న కాఫీ నీళ్లు సేవించి బయలుదేరిన ప్రాణి మరి?

"శారదానాథ్"

మనసు ఇంటివైపు శరీరాన్ని లాక్కుపోవడానికి ప్రయత్నిస్తోంది. రామిగాడు 'దయచెయ్యండి' అంటూ సెట్టిగారియింటివైపు త్రోవ చూపిస్తున్నాడు. పిలచినప్పుడు వెళ్లకపోతే ఆ శ్రీమంతుడికేంకోపమొస్తుందో? తీరా వెళితే ఏ సంభాషణలతో ఎంతసేపు నిలబెడ్తాడో? వలలో చిక్కిన చేపలా కొట్టుకుంటోంది నా మనస్సు.

'ఏం రామం! సెట్టిగారెందుకు రమ్మన్నట్టు?'

'ఏమోనండి. నాకు తెల్దు.'

'సరే పద.' ఆలస్యమైన కొద్దీ ఆరాటం ఎక్కువవటంచేత ఆయన్ని చూడడానికే నిశ్చయించేను.

* * *

సెట్టిగారు తూగుటుయ్యాలలో కూర్చున్నారు. ప్రక్కనుంచొని కామయ్య ఆకులకు సున్నంరాసి అందిస్తుంటే ఒకొక్కటి ఈనెలుతీసి మడతపెట్టుకొని నోట్లో వేసుకుంటున్నారు. అప్పుడే అన్నంతిన్నట్టుంది 'బ్రేవ్' అంటూ మధ్య మధ్య త్రేన్చుతున్నాడు. ఎదురుగా వెళ్లి 'నమస్కారం బాబూ!' అన్నాను.

'ఓహో. పంతులుగారా! రండి రండి. అలా కుర్చీమీద కూర్చోండి. ఇంతఎండలో బళ్లోనుంచేనా?'

'చిత్తం. తమరెందుకో పిల్చారంటే...'

'అదేం మర్యాదయ్యా నిలబడే మాట్లాడతారు. కూర్చోండి ముందు, తర్వాత మాట్లాడదాం-పాపం ఎండలో నడిచొస్తున్నట్టున్నారు. ఒరేయ్-కామూ!-రెండు కలర్లు తీసుకురారా-అబ్బె అదేంటయ్యా ఒచ్చి కూర్చోమంటేనూ-

సెట్టిగారి ఆదరసత్కారాలకి ఆశ్చర్యపోతూ విధిలేక కూర్చున్నాను-అయనవైపు వింతగా చూస్తూ...

'బాబూరావు బళ్లోనే నా పని చేస్తుంటేది పంతులూ?'

'చిత్తం?'

'జీతమెంతిస్తారు?'

'ఏం జీతం బాబూ! అంతా కలిపి 40 రూపాయలు-'

'ఇంతేనా? పాపం-పిల్లలెంతమంది?'

'పిల్లలకి లోటులేదండి. నలుగురున్నారు. ఒక మగపిల్లాడు. ముగ్గురాడపిల్లలూనూ-'

'ఈ జీతంతో యింతమంది నెలా పోషిస్తున్నారు? మునిసిపాలిటీలో ఎక్కువిస్తారేమో? ప్రయత్నించలేదా!'

'ఒక పది రూపాయ లెక్కువొస్తాయండి. కాని అందులోని ఉద్యోగాలు మా కందరాని నక్షత్రాలు కదండి!'

'ఇంతమంది కౌన్సిలర్లున్నారు. ఎవ్వరూ నీకీపాటి సాయం చెయ్యలేకపొయ్యేరటయ్యా? పాపం. నేనైతేనా... ఎవర్నైనా వెళ్లడిగేరా?'

'చిత్తం. మాలాంటివాళ్లని చూసే దెవరు బాబూ! మళ్లా ఓట్లు అవుసరం ఒచ్చేవరకూ మేం కనపడతామండి."

'అదేనయ్యా వీళ్ళతో ఒచ్చిన చిక్కు. అవుసరం తీరేవరకూ కాళ్లావేళ్లా పడి తిరుగుతారు. అవుసరం దాటిపోగానే తెప్ప కాలుస్తారు. మన వార్డు సంగతి చూచేరా? ఎంత అధ్వానంగా ఉందో. రోడ్డుమీద మనుష్యులు నడవలేరు. కాలవల్లో మురికినీరు కదల్లేదు.'

'బాధ్య తెరిగినవా ళ్లెవరైనా కౌన్సిల్లోకొస్తేకదు బాబూ బాగుపడడానికి.'

'ఈ నెలలో ఎలక్షన్లున్నాయి కదూ మ్యునిసిపాలిటీది. మనవాళ్ళంతా నన్ను

నిలువబడమంటున్నారు. కాని సాక్ష్యం లేదు. ఏమంటారు?'

సెట్టిగారి మర్యాదల్లోని నిగూఢ రహస్యం ముసుగు తొలగించి బయటకు తొంగిచూచింది. ఇదా సంగతి. ఒక్క నిట్టూర్పు విడిచేను.

'చిత్తం. తమలాంటి పెద్దలు మావార్డుకు కౌన్సిలరవండకన్న కావలసిం దేముంది బాబూ!' మర్యాదకోసం అనక తప్పని మాటలవి.

'హాయిగా ఉండే ప్రాణాన్ని కష్టపెట్టడం ఎందుకని ఆలోచిస్తున్నాను-ఎందుకండీ మనకీ గాడిదబరువు. ఏమంటారు.'

'తమ రలా అంటే ఎలా. తమవల్ల ఉపకారాలు పొందఒచ్చని మన వాళ్ళ ఉద్దేశం'

'అదే ఉద్దేశం. అంతా ఒచ్చి నా మెడ విరిచేరు. మొత్తంమీద ఒప్పుకోక తప్పింది కాదు. మీరంతా ఉన్నారుకదా అన్న ధైర్యం కొద్దీ. ఏమంటారు.'

'మనవాళ్ళకి మేలుచెయ్యడానికే గాని మాకెందుకుబాబూ ఈ ఉద్యోగం. ఏదో మీలాంటి వాళ్ళొస్తేనే మాకు త్రోవ కలగడం.' ఎందుకైనా మంచిదని ముందు జాగ్రతకన్న మాటలవి. ఏమో? ఎవరికి తెలుసు. ఈయనే కౌన్సిలరైతే డబ్బున్నవాడు కాబట్టి.

'ఏదో భగవంతుడింత మాకు పెట్టేడా? మాకు కావలసిం దింకేముంది? ఏదో కొందరకు సాయం చెయ్యడమే కాని. అందులో మీలాంటి వాళ్లకు ముఖ్యంగా.'

నిజం చెప్పకేం. సెట్టిగారి ఈ ఆఖరి వాక్యం అదో విధమైన ఆశను కలిగించింది నాలో.

కామిగాడు యింతల్లో కలర్లు తెచ్చేడు. 'ఇయ్యరా! పంతులుగారి కియ్.' సెట్టిగారు నావేపు చూపించేరు.

'భోజనంయుంది దెందుకులెండి.'

'కలరు కేమయ్యా? ఎండలో పడినడిచొచ్చేరు. ఎప్పుడు తిన్నారో ఏమో?'

కామిగాడు కార్కు తీసిచ్చేడు. ఎండదెబ్బకు నాకూ గొంతుక పిడచ కట్టిఉండటం చేత-ఆకలి బాగా చేస్తుండడంచేతా-ఎందుకంటూనే రెండుబుడ్లూ త్రాగేను. కొంచెం హృదయంలో శాంతి.

'చూడండీ పంతులుగారూ! మన యింటికి దగ్గరేకదూ మనవార్డు మునిసిపల్ స్కూలు-అక్కడైతే యింత కష్టం ఉండదు. సుమారు మైలు నడవాలికదూ యిప్పుడు.

'చిత్తం. చాలా కష్టంగా ఉందిబాబూ రెండుపూటలూ తిరగటం. అక్కడ దొరికితే బ్రతికిపోదును.'

'కాదుటయ్యా మరి. ఇం కెన్నాళ్ళు. ఒక్క నెల కష్టపడండి. అంతే.'

'ఏదో. మీదయ.' ఆయన కలిగించిన ఆశ బాగా అల్లుకుంది హృదయానికి.

'మనకి మనం సాయం చేసుకోడంలో దయేముంది. మీరు మాకు సాయం చెయ్యడం మేము మీకుసాయం చెయ్యడం మన ధర్మం.'

'మీలాంటి పెద్దల సాయం మాకు కావాలి గాని మేం చేసేదేముంటుంది బాబుగారూ.'

'అదేమన్నమాట. ఒకరి సాయం ఇంకొకరికి తప్పకుండా కావాలి. మాటవరుసకిప్పుడు చూడండి. నేను కౌన్సిలరుగా నెగ్గాలంటే మీసాయం తప్పకుండా కావాలి.'

'మావల్లేమౌతుందండి?'

'అదేమన్న మాట. మీరు తలుచుకుంటే మీవాళ్ల 25 ఓట్లూ మాకు వేయించగలరు. అది చాలదూ. మీరు తలుచుకోవాలిగాని.'



[illegible]'

'మీరు ప్రయత్నిస్తారనే నా నమ్మకం. మనం రాకపోతే మనపని ఈ మునిసిపాలిటీలో జరుగుతాయనుకోను.'

'ప్రయత్నిస్తాను. అధమం పదైనా వేయించగలననుకుంటాను.'

'అవి చాలు. ఆ మిగిలినవాటికి కూడా ప్రయత్నించి చూడండి.'

'చిత్తం.'

'పాపం. మీకాలస్యమైనట్టుంది భోజనానికి. క్షమించండి.'

'ఎంతమాటన్నారు! వస్తాను బాబూ శెలవ్.'

'శెలవ్.'

* * *

సరిగ్గా ఒంటిగంట అయింది. సెట్టిగారి దగ్గర శెలవు తీసుకొని తొందరగా యింటి వైపు ముఖం త్రిప్పేను. 'పాపం. మన పంతులు చాల శ్రమపడుతున్నాడురా. ఎలాగైనా మునిసిపాలిటీలో వేయించాలి' అన్న సెట్టిగారి మాటలు చెవులకు తగిలి నాలో ఉన్న ఆశల్ని రేకెత్తించేయి. ఆశలు రేపిన ఆనందంలో అతి తొందరగా నడక సాగించేను. ఇన్నాళ్లకు కష్టం తప్పే సూచనలు భగవంతుడు ప్రసాదించేడు. సెట్టిగారి విజయాన్నాకాంక్షిస్తోంది నా హృదయం; ఆలోచనల్లో అంతర్లీనమైంది నా మనస్సు.

'ప్రసాద్! ప్రసాద్!' వెనక నుండి ఎవరో పిలుస్తున్నట్టుంది. శర్మ పరుగులాంటి నడకతో నా వైపు వస్తూ నిలబడమని సైగ చేస్తున్నాడు. ఆగక తప్పలేదు విసుగుకుంటూ.

'ఏంరా శర్మా ఎక్కణ్ణించిరా?'

'ఇలా గోవిందు దగ్గరకెళ్లి యిలా వస్తున్నాను.'

'ఏం? ఏం సంగతి?'

'నీకు తెలుసును కదురా. నేను మన వార్డుకు కౌన్సిలరుగా నిలవబడుతున్నాను. వాడి కాసంగతి చెబుదామని వెళ్లేను.'

'ఓహో! సెట్టిగారికీ నీకూ పోటీ అన్న మాట! నవ్వుతూ అన్నాను'

'అవున్రా. అతడు డబ్బున్నవాడు. అయినా మీరంతా ఉన్నారన్న ధైర్యంతో నిలబడ్డాను నేను.'

'శర్మా నేనూ థర్డు ఫారందాకా ఒకే బడిలో ఒకే క్లాసులో కలిసి చదివేం. చాలా మంచివాడు. కాని ముక్కుసూటిగా పోయే మనిషి. దేశంకోసం చాలా కష్టపడ్డ దేశ సేవకుడు.

'మంచి పని చేసేవ్.'

'నువ్వు తప్పకుండా సాయం చెయ్యాలి. గోవిందు ఓట్లన్నీ వేయిస్తానన్నాడు. నీవి నాకు నమ్మకమే. ఏమంటావ్?'

'అలాగేలే.'

'వస్తాను.' శర్మ ప్రక్క సందులోకి పోయేడు పనుండి. నేనూ నా యింటికి పోయేను ఆలోచనలతో. భోజనం చేస్తూ ఆలోచించేను. శర్మ తనకు చేతనైతే తప్పకుండా సాయం చేస్తాడు. కాని తనగురించి గాని తనవారిగురించిగాని యితరులకు ప్రాధేయపడి కార్యాలు సాధించడానికి ఒప్పుకోడు. అటువంటివాడు నాకేం సాయం చేస్తాడు. సెట్టిగారు తప్పకుండా సాయంచేస్తాడు. సెట్టిగారికే నా ఓట్లు యియ్యడానికి నిశ్చయించేను.

* * *

ఎలెక్షను రోజు రానే వచ్చింది. ప్రొద్దున్నే శర్మ నా దగ్గర కొచ్చి 'ఏంరా ప్రసాద్-మీ బాబులుగాడి ఓటు నువ్వు సెట్టి కిమ్మన్నావుట! అని అడిగేడు. 'ఎవడు చెప్పేడ్రా నీకు. అదంతా ఒక స్టంటులే.' అన్నాను. నాకు తెలుసులే నువ్వదగా చెయ్యవని. వస్తాను. తొందరగా వస్తావు కదూ పోలింగు బూతుకు. అక్కడ సాయంచెయ్యాలి.' తొందరగా వెళ్లిపొయ్యాడు అమాయకంగా. ఇంతలో సెట్టిగారి కారు మా యింటి ముందుఆగింది. 'మిమ్మల్ని తొందరగా రమ్మన్నారు' అన్నాడు డ్రైవరు. 'సరే' అని బట్టలు వేసుకొని బయలు దేరాను. పోలింగు స్టేషన్ దగ్గర జనం అప్పుడే చాల మంది మూగి ఉన్నారు. రెండు వైపులా కేన్వాసింగు ప్రారంభమయింది. సెట్టిగారి కారులో నేను దిగడం చూచిన శర్మముఖం ఆశ్చర్యం ప్రకటించింది. 'ఏంరా?' అన్నాడునన్ను చూచి. 'ఏం?' అన్నాను నేను ఎదురుగా. 'ఇదేం టిలాచేసేవ్?' అన్నాడు. 'ఆయన సాయం చెయ్యమని బతిమాలేడు.' అన్నాను. 'మన స్నేహం మరచిపోతున్నావ్', మాట్లాడలేదు నేను. 'సరేలే' అని వెళ్లిపోయేడు నిస్పృహతో.

సెట్టిగారిప్పించిన సోడాలూ-కాఫీలూ-త్రాగుతూ భోజనమైనా చెయ్యకుండా రహస్యంగా ఆయనతరఫున ప్రోపగాండా చెయ్యటంలో కొన్ని ఓట్లు శర్మప్రక్క నుండి యిటు వేపు త్రిప్పగలిగేను. మా పది ఓట్లూ అనుకున్నట్లు ఖచ్చితంగా ఆయనకే పడ్డాయి. సాయంత్రం 6 గంటలతో పోలింగు పూర్తయింది. ఆ రాత్రే ఓట్లు లెక్క కూడా జరిగింది. సరిగ్గా 5 ఓట్ల మెజారిటీతో సెట్టిగారు గెలిచేరు. శర్మ దీనంగా నా వైపు చూచేడు. నేను ముహం త్రిప్పుకొని సెట్టిగారి మెడలో బ్రహ్మానందంతో పూలదండ వేసేను. ఆయన తరఫు వాళ్లంతా ఆయన్ను ఎత్తుకొని జయ జయ ధ్వానాలతో యివతలకు తీసుకొచ్చేరు. ఆయన్నింటివద్ద దిగబెట్టి శలవు తీసుకొని నేనూ యింటికి పోయేను.

ఆ రోజు రాత్రి ఆనందాతిశయంచేత సరిగ్గా నిద్ర పట్టడంలేదు. ఆ దినం పోలింగు స్టేషన్లో నేను పడిన శ్రమ చేసిన ప్రొపగాండా వేయించిన ఓట్లు వివరంగా మా ఆవిడతో వాడినపదం వాడకుండా వర్ణించి చెప్పేను. నాతోపాటు నా భార్య కూడా నిద్రపోలేదు. కంన్లు మూసేసరికి నేనుపడిన శ్రమకు సెట్టిగారు పదిమందిలోనూ నన్ను ప్రశంసిస్తున్నట్టూ- అందరిలోనూ నన్ను గౌరవించినట్టూ—మ్యునిసిపల్ కమీషనరుతో వాదించి మా మ్యునిసిపల్ స్కూలులోనే 'హెడ్‌మాష్టరుగా వేయించినట్టూ-తోటి మాష్టర్లంతా నన్ను ఈర్ష్యగా చూస్తునట్టూ-శర్మ కనబడ్డ వాళ్ళందరితోనూ నేను చేసినదగా చెప్పి నన్ను నానారీతులా తిడుతున్నట్టూ-

ఇంకా ఏవో-ఏవో దృశ్యాలు స్వప్నరూపంగా సాక్షాత్కరిస్తున్నాయి. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు సెట్టిగారిచే ప్రశంసలు పొందుతానా అన్న ఆతృత నన్ను మితంగా ఆవరించింది. తెల్లవారింది. కాలకృత్యాలన్నీ తీర్చి కాఫీ త్రాగి సెట్టిగారింటికి బయలుదేరేను. కాలు తీసి యివతల పెట్టేనో లేదో మా పొరుగింటి విధవామె ఎదురుగా ఒచ్చి 'ఏంబాబూ ఇంత తెల్లారగానే ఎక్కడికి పోతున్నావ్?' అని అడిగింది. నా హృదయం చివుక్కుమంది. గుండె ఝల్లుమనింది. 'ఎక్కడికీ లేదత్తా' అని ఎలాగో అని వెనక్కు తిరిగి మంచంపై కూలబడ్డాను. 10, 15 నిముషాల తర్వాత తొందర తొందరగా యిల్లుదాటి సెట్టిగారింటి వైపు బయలుదేరాను. శర్మ ఎక్కడనుంచో అప్పుడే ఒస్తున్నాడు. వాడు దాటి పొయ్యేవరకు ప్రక్కసందులో దాక్కుని, తరవాత బయలుదేరి సెట్టిగారిల్లు చేరేను. కామయ్యను పిలచి 'సెట్టిగారేంచేస్తున్నా'రన్నాను.

'రాత్రి నిద్రలేదు-అంచేత పరున్నారు. ఇంకా లేవలే'దన్నాడు.

'సరే' అని బడికివళ్ళి 10-30 ఎప్పుడౌతుందా అని గడియారానికి కళ్ళు నంటించి బడి విడిచిపెట్టగానే ప్రైవేట్లు కానాటికి స్వస్తిచెప్పి సెట్టిగారింటికి చేరేను. అదృష్టవశాత్తూ సెట్టిగారింట్లోనే ఉన్న సూచనలు కనిపించినై ఎవరో స్నేహితులతో కలసి లోపల నవ్వుకుంటున్నారు. బహుశః తమ ప్రత్యర్థికి సంభవించిన అపజయ విశేషాలు తలంచుకొని ఆనందిస్తున్నారు కాబోలు. రామిగాడు కనిపించేడు. విజయానంద సూచకంగా సెట్టిగారు స్నేహితులతో విందారగిస్తున్నారనిన్నీ పదిహేను నిముషాలాగితే కలుసుకోవచ్చుననిన్నీ చెప్పేడు. ఎందుకో మనస్సు కొంచెం బాధ పడ్డది. 'సరేలే' అని అక్కడ బల్లపై కూర్చున్నాను. 15 నిముషాలు-అరగంట-ఒకగంట అయింది-మిత్రులొక్కొక్కరూ బయట కొస్తున్నారు. సెట్టిగారుకూడా చివరగా వారి ననుసరించి యివతల కొచ్చేరు. నుంచొని నమస్కారం చేసేను విజయానందసూచకమైన చిరునవ్వుతో-ఆయన వద్దనుండి కృతజ్ఞత నాసిస్తూ. నన్ను చూచి నమస్కారా న్నందుకుని మిత్రులతో కలసి వీధి గుమ్మంలోకి పోయి కబుర్లలోకి దిగేరు. నన్ను తృప్తిపరచడానికి చిన్న చిరునవ్వైనా కనుపించలేదా ముఖంలో. సెట్టిగారిలోని యీ నిర్లక్ష్య భావానికి నేను నిర్విణ్ణుణ్ణయి కొయ్యబారి పోయేను. హృదయంలో రేగిన తుఫానుకు మెదడులో కట్టిన మేడలు కూలిపడుతున్నై.

అక్కడ నిలువలేకపోయేను. ఎదురుగా ఒచ్చి 'శలవు తీసుకుంటాను బాబూ' అన్నాను సెట్టిగారివంక తిరిగి. 'ఇంకా కమీషనర్ను కలుసుకో లేదయ్యా! కలిస్తే నీసంగతి చెప్తానులే' అన్నాడు. 'చిత్తం' అని మాత్రం అని గిరున తిరిగి యింటి ముహం పట్టేను. 'ఓటు యిచ్చినందుకుద్యోగ మిప్పించాలటోయనకు' అన్న సెట్టిగారి మాటలు నా తలపై గాఢంగా గొడ్డలి ప్రేట్లు వేసేయి. గుండె బరువెక్కింది. కాళ్ళీడ్చుకుంటూ యిల్లుచేరేను. ఆ దినం భోజనం రుచించలేదు. మంచంపై బోర్లా పడిపోయేను. ఆపినా ఆగకుండా హృదయంలోంచి దుఃఖం బయట కుబికుబికి వస్తూంది. నానించి మా ఆవిడ కూడా ఆదినం భోజనం చెయ్యలేదు. జరిగిన విషయా న్నావిడకు చెప్పడానికి సాహసించ లేకపొయ్యేను. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. శర్మ నాకళ్ళ ఎదుట చిన్నబోయిన ముఖంతో సాక్షాత్కరిస్తున్నాడు. అతని స్నేహితులు నాస్థితికి నవ్వుతూ నా చుట్టూ నృత్యం చేస్తున్నారు. కాలం బరువుగా గడచింది. ఎట్టకేలకు తెల్లవారింది. విధిలేక కాలకృత్యాలు తీర్చి బడికి బయలుదేరేను. సెట్టిగారు గుమ్మంలో నుంచొని కాలువలు తుడిచేవాడిని గద్దిస్తున్నారు-తన కాలవ సరిగ్గా తుడవటం లేదని. నమస్కరించేను. అందుకొని కమీషనర్ని కలిసేనయ్యా. ఖాళీ లేవీ లేదన్నాడు.' అని మాత్రం అని లోపలికి వెళ్ళిపోయేడు. రామిగాడు లోపల్నించి ఎవరితోనో నవ్వుతూ అంటున్నాడు 'ఓటిస్తే ఉద్యోగా లొస్తాయనుకున్నాడు పిచ్చిపంతులు' తగిలిన గాయంపై మరొక్క గాయం. తల దిమ్మగా ఉంది. చెవులు మూసుకొని శిరసు ఒంచుకొని నడక జోరుచేసేను. కొంతదూరము పోయి తలెత్తి చూద్దునుకదా పాఠశాల త్రోవ తప్పి ప్రక్క త్రోవలో పడ్డాను. శర్మయిల్లా సందులోనే ఉంది. తిన్నగా అతని యింటికి పోయేను శర్మకాళ్లపై పడి క్షమాపణ చెప్పుకుందామని... 

# స్వయంవరాలు

**ఆర్. యమ్. చిదంబరం**

'నాకి పెళ్ళి వద్దు నాన్నా'

యోచనా సముద్రంలోపడి గంట సేపటినుండి కొట్టుకుంటున్న రాధాకృష్ణ ఒడ్డుచేరాడు. తండ్రి నిశ్చయించిన సంబంధాన్ని కాలదన్నటానికే నిశ్చయించాడు.

'అదేమిట్రా! నీ మేలు కోరి చేస్తూంటే వద్దని వాదిస్తావు. సిరిరా మోకాలొడ్డువాడుంటాడురా? చదువుకున్న తరువాత నీ మతి కాస్తా పోయిందా? రత్నంలాంటి పిల్లను కోడలుగా తెచ్చుకుందామని నేను యత్నిస్తూంటే నువ్వు వద్దని పట్టుబడతావెందుకు? పోనీ, నీకంత బాధగా ఉండటానికి నేనేమన్నా నీ మెడకు కోరివి దెయ్యాన్ని కడుతున్నానా? సలక్షణమైనదే జానకి. ఏమిటా మాటలు?' అని గ్రుడ్లు వురి మారు రామయ్యగారు.

ఎన్నడూ తండ్రి అభిప్రాయాలకు ఎదురాడని రాధాకృష్ణ యీ నాడిలాగ స్వంత అభిప్రాయాన్ని వెలిబుచ్చటం మెచ్చుకోదగ్గ విషయం. అవును మరి జీవిత సమస్య యిది. ఇప్పుడే జాగ్రత్తగా ఆలోచించి మంచిని నిర్ణయించుకోవాలి. ఇప్పుడు పరాకుగా ఉండి పరుల భావాలకు, ఊహలకు తలవంచితే ముందు ముందు కుమిలిపోవలసి వస్తుంది. అందుకే రాధాకృష్ణ ఈ నాడు తెగించి సమాధానం చెప్పాడు.

కొడుకీవిధంగా తన ప్రయత్నాలకు భంగం కలిగించటం రామయ్యగారికికూడా ఆశ్చర్యాన్ని కలిగించింది. 'ఇవాళ వీడిలాగ ఎందుకు మారిపోయాడా?' అనాయన యోచించారు. కాని సరియైన కారణం కన్పించలేదు. రాధాకృష్ణ మౌనంగానే ఉన్నాడింకా.

'ఏరా! అసలీ పెళ్ళివద్దనటానికి కారణం ఏమిటి? పిల్ల బాగా లేదా?......ఆ మాట నువ్వు కాదు—ఈ జగత్రయంలో ఎవరూ అనలేరు—ఆ కారణమేమిటో చెప్పు.'

'అది కాదు నాన్నా. ఆపిల్ల నాకు నచ్చలేదు. నీకు బాగా కనిపించే వస్తువు మరొకరికి నచ్చక పోవచ్చు. నీ అయిష్టానికి గురియయిన వస్తువు మరొకరికి యింపుగా కనపడొచ్చు. బాహ్య సౌందర్య నిర్ణయం నిర్ణయించే వాడి మనస్తత్వాన్ని బట్టి ఉంటుంది. కనుక జానకి నాకు సుతరామూ నచ్చలేదు.'

అతని హృదయంలోని ఆవేదనను బయటపెట్టడానికి జంకుతున్నాడు. అతని వాక్స్వాతంత్ర్యతను పూర్తిగా హరించివేసింది రామయ్యగారి ప్రభుత్వం.

రామయ్యగారీ మాటను నమ్మలేక పోయారు.

'చాలే! ఎవడన్నా వింటే నవ్విపోతాడు. జానకి బాగాలేదట. పై పెచ్చు ఏ పుస్తకాల్లోనో చదివేడిసిన మనస్తత్వశాస్త్రాలు నా దగ్గఱ వల్లెవేస్తున్నాడు. ఇదిగో శాంతా! వీడు లోకాను భవంలేని కుఱ్ఱకుంక. అనుభవం మీద నేను చెప్తున్నాను. ఇది బంగారంలాంటి సంబంధం. సుందరానికి మాట యిచ్చాను. మాట ప్రకారం నడచుకోకపోతే నా పరువూ-మర్యాదా మంట గలుస్తాయి. వాడి నెలాగయినా ఒప్పించే భారం నీది.' అని చరాలున బయటకు పోయారు రామయ్యగారు.

శాంతమ్మ ఎటూ చెప్పలేక తికమకలు పడుతోంది. స్వయంగా సమ్మతం కాకపోయినా భర్తకు భయపడన్నా రాధాకృష్ణను ఒప్పించటానికి యత్నించవలసి వచ్చింది.

'కృష్ణా! నాన్న చెప్పిన మాట వింటే ఏం పోయిందిరా? నువ్వెందుకిలాగ భల్లూకపు పట్టుపడుతున్నావో నాకర్థమవటం లేదు.'

'అమ్మా! మనకి తింటానికి కావలసినంత ఉంది. ఒక బీదింటిపిల్లను చేసుకుంటే ఆమె సుఖపడుతుంది. కట్నాలకూ కానుకలకూ మన మాసించటం ఏమంత బాగుంది? కాకపోయినా మామయ్యకు నాన్న ఎంత ద్రోహం చేస్తున్నాడో ఆలోచించు. తమ్ముడి పేర ఆస్తంతా వ్రాశాడా మామయ్య? పాపం! ముగ్గురు కూతుళ్ళు. కామాక్షి పెళ్ళికి తయారుగా ఉంది. మామయ్య వీళ్ళకు పెళ్లెలా చేయడమని రోజూ ఒకటేగోల. కామాక్షిని తెచ్చుకుంటే మామయ్య బరువు కొంత దింపినట్లేనా?'

శాంతమ్మ కొడుకు నిక బలవంతపెట్టలేకపోయింది. ఆమెకుకూడా తమ్ముడికి సాయం చేయాలని ఎందుకు లేదు? కాని ఆమెకే మధికారముంది? భర్త చెప్పుచేతల్లో మెలగుతూ ఉండవలసిందే. రత్నం పేరెత్తితే నే రామయ్యగారికి అరికాలి మంట. ఆస్తంతా రాస్తానని రెండెకరాలు అట్టెపెట్టుకున్నాట్ట. అందుకే రామయ్యగారికి రత్నం మీద పగ. శాంతమ్మ మెదడు అప్రయత్నంగా ఆమెను గడచిన కాలపుసంఘటనలకుతీసుకుపోయింది.

కొన్నేళ్ళ క్రిందట రామయ్యగారు సామాన్య కుటుంబీకుడే. రత్నానికి సంతానంకలుగలేదు. రామమ్మ తల్లి కావాలని ఉబలాటపడింది. శాంతమ్మ మూడవకొడుకు రమణను దత్తత చేసుకున్నారు. రమణపేర ఆస్తంతా వ్రాస్తేనే కాని ఒప్పుకోనన్నాడు రామయ్యగారు. రత్నం అందు కంగీకరించాడు. తన కాలానంతరమే రమణకు కాని రత్నానికి కాని ఆ ఆస్తి ననుభవించే యోగమని వీలునామాలో వ్రాయించారు రామయ్యగారు. రెండెకరాలు రత్నం తన పేర అట్టేపెట్టుకున్నాడు. అందుకే రామయ్యగారి కింత కోపం! కాని అదృష్టమే అనాలో, దురదృష్టమే అనాలో రమణను దత్తత చేసుకున్న రెండేండ్లకు కామాక్షి పుట్టింది. ఆ తరువాత మరిద్ద రాడపిల్లలు పుట్టారు.

శాంతమ్మ ఈలోకంలో పడింది. రాధాకృష్ణ ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాడు. అతనికి తెగింపు తక్కువ. అతని హృదయం తుపానులో నావలాగ అటూ యిటూ ఊగిసలాడింది. తండ్రి నెదిరిస్తే తండ్రి యింట్లోంచి బయటకు గెంటేస్తాడు. తండ్రి ఆజ్ఞలను శిరసా వహిస్తే తన ఆశయా

లడుగంటుతాయి. మామయ్యకు అపరాధం చేసినవాడవుతాడు.

'కృష్ణా! చూడు! ఈ స్వల్పజీతంతో ఈ కుటుంబాన్ని ఎలా పోషించాలో నా కర్థమవటంలేదు. ఆస్తంతా రమణ పేరనుంది. కామాక్షికి తగిన వరుణ్ణి చూసి పెళ్ళిచేశావంటే నీకు సప్త పుణ్య క్షేత్రాలు తిరిగిన ఫలమొస్తుంది' అన్న మామయ్యమాటలు చెవిలో మారు మ్రోగాయి. చివరికి నిశ్చయానికి వచ్చాడు రాధాకృష్ణ. 'మామయ్యకు సాయంచేసి తీరాలి. కామాక్షిని పెళ్ళాడాలి.'

'కామాక్షికేం లోటమ్మా? ఆమెను చేసుకుంటే ఏం లోపమమ్మా?'

'నీకూ నాకూ అది సమ్మతమే, కాని నాన్నగారు దీనికి సమ్మతిస్తారని నేను కలలో కూడా అనుకోను. పాపం! తమ్ముడిని పట్టుకుని పీడిస్తున్నాం. ఎలాగో మీ నాన్నకు తెలియకుండా కామాక్షికి చదువు చెప్పించాం...' అని నిట్టూర్చి నిస్సహాయతను కనబర్చింది శాంతమ్మ.

'ఏమయినా సరేనమ్మా. నే నీ పెళ్ళికి ఒప్పుకోను. కామాక్షిని వివాహమాడి తీరుతాను. తప్పదు. మామయ్యకు ఈ పాటి ఉపకారం చేయలేకపోతే నేనెందుకు?' అనరిచాడు; ఆవేశంతో రాధాకృష్ణ. 'అంతే' నన్నదతని యంతరాత్మ.

తలెత్తాడు రాధాకృష్ణ. ఎదురుగా రామయ్యగారు పళ్ళు పటపట కొరుకుతూ నిలబడున్నారు. అతని ఆవేశం, ధైర్యం, క్షణంలో ఎగిరిపోయాయి. కుక్కిన పేనులాగయిపోయాడు. శాంతమ్మకూడా కంగారు పడిపోయింది.

'ఇదా నీ ఆలోచన? పైగా నా దగ్గఱ జానకమ్మ బాగాలేదని వాగుతున్నావా? దొంగపీనుగా! నీకు ఇంత చదువు చెప్పించి నిన్ను అభివృద్ధిలోనికి తీసుకువచ్చినందుకు నామీదనే కత్తిగడుతున్నావ్? కట్టుకో. నీ యిష్టం వచ్చిన వారిని కట్టుకో. నేను చెప్పిన విధంగా నడచుకోవట మిష్టమయితే ఈ యింట్లో ఉండు. లేకపోతే బయటకు నడు. అంతే. కాని నీ మేలు కోరి చెప్తున్నాను. ఈ సంబంధాన్ని త్రోసేయకు. నీకూ మంచిది. నా మాటా నిలుస్తుంది. జాగ్రత్తగా యోచించుకో' అన్నారు రామయ్యగారు. రాధాకృష్ణ ఏమీ సమాధానం ఇవ్వకుండా పార్కుకి బయలుదేరాడు.

యోచించాడు. చీకటిపడేవరకు మెదడుతో కుస్తీ పట్టాడు. ఇద్దరు దగ్గరు స్నేహితులు వస్తే ఈ చిక్కును విడదీయమన్నాడు. ఎవరికి తోచిన విధంగా వారు సలహా యిచ్చారు. చివరికతను రెండే నిర్ణయాలకు వచ్చాడు. తన ఆశయాలకు ఉద్వాసన చెప్పి మామయ్యను కష్టాల పాలు చేయాలి. లేకపోతే తండ్రి ఆస్తిపై ఆశలు వదలుకొని కామాక్షిని కట్టుకోవటం. మొదటి నిర్ణయాన్ని హృదయంలోనికి చొరనీయకుండా ధైర్యాన్ని కాపలా పెట్టాడు. తిన్నగా మామయ్య ఊరికి పోయాడు. మామయ్య ఇంత హఠాత్తుగా దిగిన రాధాకృష్ణను చూచి ఆశ్చర్యపోయాడు.

'ఏరా! ఉత్తరం ముక్కయినా పడేకుండా దిగావు?' అనడిగాడు.

రాధాకృష్ణ అరుగుమీద తాపీగా కూర్చుని సంగతి సందర్భాలను విడమర్చి చెప్పి తన మనోనిశ్చయాన్ని తెలియజేశాడు. రత్నం సంతోషంతో ఎగిరి గంతేయలేదు. తండ్రి అనుమతితో రాధాకృష్ణ కామాక్షి నడగటానికి వస్తే ఆనందంతో ఉప్పొంగి పోయేవాడేమో!

'నాన్న అలా గంటాడు కాని నిన్ను

(1[illegible]-వ పేజీ చూడండి)



# తలలునున్ననైన

## శ్రీ అవసరాల రామకృష్ణారావు

'ఏమమ్మా శకుంతలా, ఏం చేస్తున్నావ్,'

'రండమ్మా మాణిక్యమ్మగారూ...... యిదుగో గోంగూర ఒలుస్తున్నాను. మొన్న మా ఆడబడుచు గుంటూరునుంచి వస్తూ యిది యింత దెచ్చి పడేశారు. మావారు గోంగూర పచ్చడంటే చెవి గోసుకుంటారు. ఏదో యింత పచ్చడి పెట్టేస్తే ఎప్పుడే ఆదరువు లేకపోయినా అంత యిబ్బంది ఉండదు'

'మరే నేనూ ఒలవనా?'

'వద్దండీ, పెద్దలు మీకెందుకంత శ్రమ.'

'ఆ. శ్రమ కే ముందమ్మా, సరే, యీ మధ్య ఏమిటి సంగతులూ?'

'ఈమధ్య పెద్ద గొడవే జరిగిపోయిందండోయ్.'

'ఏమిటది?'

'అదే, వినండి చెబుతాను... మాయింటికి మూడిళ్లవతల ఓ తల మాసిన ఆవిడా, ఆవిడకి ఓ కూతురూను. వారికీ నాకూ యీమధ్యనే కలిసింది లెండి'

'ఎలా కలిసిందీ?'

'ఆవిడ కూతురికి అప్పుడప్పుడు గుండెల్లో నొప్పి వస్తూంటుందిట. మీ అన్నయ్య మందు లిస్తూంటారు గదూ, ఎవరో చెబితే విని, ఆ వెధవావిడ, అదే సుబ్బమ్మగారు, ఓనాటి దీపాలెట్టేవేళ మాయింటికి చక్కా వచ్చింది. మీ అన్నయ్య మందు లిస్తూండే వారు. ఏ మందులూ యింత బాగా త్వరగా పని చెయ్యలేదని సుబ్బమ్మగారు నాలుగు రోజులపాటు మందులు పట్టుకెళ్ళిందండోయ్—మీఅన్నయ్యా ఏదో లేనివారు గదా అని దమ్మిడీ అడగలేదు సుమండీ... ఇలా వెడితే బాగానే ఉండును—'

'ఏం జరిగిందీ?'

'అప్పుడూ, యిప్పుడూ కట్టింది అంతా మొత్తం రెండొందలదాకా యీ మధ్య మాకు వడ్డీ వచ్చింది. అలా వాడేస్తే 'పులుసూ, బెల్లం' కింద అయిపోతుందని వీథివైపు ఓ గది కట్టిద్దా మనుకొన్నాం—అన్నీ మా యింట్లోనే ఉన్నాయి గాని 'పార' మాత్రం లేకపోయింది. అప్పుడు పోనీ మనవాళ్ళేగదా అని సుబ్బమ్మగారికి, కబురు పెట్టేను'

'పార పంపించిందా?'

'పంపించకపోయినా బాగానే ఉండును. వెంటనే పంపించింది. పంపించిన పావుగంటకు ఆవిడొచ్చి మందు తీసుకువెళ్ళింది. ఆవాళ్లా కూలివాళ్లు పని చేశారు. ఆ సాయంకాలం అయేసరికి పార కనపడలేదు'

'ఏమైందీ?'

'ఏమో, అదే తమాషా! మూడేళ్ళనుంచి పని చేస్తున్నారు. మా పనివాళ్లను అనుమానించవలసిన పని లేదు'

'మరేమైనట్లు?'

'ఏమో, అది మొదలు—మాణిక్యమ్మగారూ, మీరు నమ్మతారో నమ్మరో గాని గంటకు పదేసి కబుర్లు—'మా పారేది? మా పారేది?' అనుకుంటూ...యిదేం' వెండా, బంగారమా చెప్పండి మేము దాచేసుకోడానికి?'

'ఎంతమాట?'

'మేమూ, ఖర్చులు ఎక్కువైపోయి—ఆ నెల గడవకే యిబ్బంది పడుతూంటే... గడీగడీకి యిదో కబురా? నాకు వళ్లుమండి 'సుబ్బమ్మగారూ, మేమేం మరోలాంటి మనుషులం కాదు. కొద్దిగా యిబ్బందిలో ఉన్నాం... చేతికి సొమ్ము అందుకు రాగానే మీ పార క్షణంలో కొని యిచ్చేస్తాం' అన్నాను. సరే అని ఊరుకోవచ్చా, మర్నాడు పొద్దున్న గిరుక్కున తిరిగొచ్చి

'అమ్మోయ్ - మా పార అందరిలాంటిది కాదు. అయిదు రూపాయలుంటే యిలా యియ్య సంతలో తప్ప అలాంటి పారలు దొరకవు' అంది. 'ఇంతోటి పారల కోసం అంత దూరం వెళ్లాలా? మీ కూతురి అధర ద్వారం విప్పితే ఒకటా రెండా అలాంటివి ముప్పైరెండు దొరకవూ?' అని మనసులో అనుకొని

'అయినా పారలో పెద్ద ప్రత్యేకత ఏమిటమ్మా?'

'ఏమో చూడండి ఆశ్చర్యం? అసలు పార రూపాయి పద్ధాలుగణాలు సుమండీ మంచిదయితే-అంతా కలిపి మహా అవుతే రెండున్నర అవుతుంది. సహానికి సహం కమిషన్ బాగుందా?'

'అయితే నువ్వప్పుడేమన్నావ్?'

'ఏమంటానూ, 'అదేమిటి సుబ్బమ్మగారూ, అన్ని సార్లు అడుగుతారు? యీ మధ్య గదీ అదీ కట్టించి తడిసి మోపుడై యివ్వడానికి సొమ్ము లేకపోయిందిగాని, మేమేం ఉంచేసుకుంటామా, త్వరలో మేమే మంచిది చూసికొనియిస్తాం వెళ్లండి' అన్నాను. పోవచ్చునా. మళ్లీ క్షణంలో వచ్చిందండోయ్,

అబ్బబ్బ! వింటున్న నాకే విసువేస్తోంది వచ్చి ఏమందీ?'

'వచ్చి, 'శకుంతలా, మళ్ళీ దొరకమంటే మాత్రం యింత ఖేష్మైన పార దొరుకుతుందిటమ్మా, యిలాంటి పార ఎలా యిచ్చావ్, ఏమంటూ యిచ్చావ్? అని ఆ మనిషి నన్ను నిలవనియ్యడం లేదంటే నమ్ము' అంది.'

"ఆ మనిషి' ఎవరమ్మా?"

'ఏమో, ఆ ఎదురుగుండానే ఉంటాడో దిగంబరస్వామి' ఎవరని చెప్పను? వాళ్లకూ వీళ్లకు ఏం సంబంధమో, సహాళసపైలూ చేస్తూ ఉంటాడు.'

'బాగుంది, అప్పుడు నువ్వేమన్నావ్?'

'మీ అన్నయ్య అప్పుడే లేచి మొహం కడుక్కుంటున్నారు. ఒళ్లుమండి ఆయనే తగులుకొన్నారు. జలకడిగేశాకంటే నమ్మండి.'

'మంచిపనిచేశారు, ఏమన్నారేమిటి?'

'ఒహాళ్ల కొహాళ్లు స్నేహాన్నిబట్టి అనేకం యిచ్చుకుంటాం, పుచ్చుకుంటాం, యింత రాద్ధాంత సిద్ధాంత మేమిటి? ఎందుకిచ్చావని అడగడ మేమిటి సబుబు లేని మాట? అలా అయితే యిన్నాళ్లబట్టీ దమ్మిడీఅయినా యివ్వకుండా మందు లెలా పట్టుగెడుతున్నారు? అంతా మొత్తం పదిహేను పైమాటగా మందుల ఖరీదు అయింది. ఫీజు అయిదు. మొత్తం యిరవై. మీ పార ఖరీదు పోనీ మీరన్నట్టు అయిదు. మిగిలిన పదిహేనూ తెచ్చి యిలా యివ్వండి' అని గట్టిగా అన్నారు.

'తగినట్టే చెప్పేరు. ఆవిడ ఏమందీ?'

'అబ్బో, ఆవిడ తక్కువదా? 'మీ మందులు మాకు పనే చెయ్యలేదంది.' దాంతో మీ అన్నయ్యకు చిర్రెత్తి దులిపేశారు.'

# తలప్పులుసున్నా?

‘దులిపెయ్యరూ మరి? గడీకోమాటా?’

‘ముందు తెగపాగిడి, ఆ తిరువాత పని చెయ్యలేదంటే కోపంరాదూ? ఆ కేకలికి జడిసి సుబ్బమ్మ మరిమాటాడితే ఒట్టు’

‘మరి, రాలేదన్నమాట?’

‘ఊహు. అయినా మన కెందుకండీ వెధవ పార? మొన్న నే కొని తెచ్చేరు పరిపించేస్తాం’

‘అయితే, యింతకి పార ఎవరు తీసుకున్నారో తెలియలేదన్న మాట’

‘లేదండీ’

‘పారంటే జ్ఞాపక మొచ్చిందీ, యీ మధ్య మాయింటి ముందు కాలువ బాగుచేయించు కుందామని మేమూ ఒకళ్లదగ్గిర పార తెచ్చాంసుమా’

‘అలాగా, దీనికింత అయిందా, త్వరగా యిచ్చెయ్యండి మాణిక్యమ్మగారూ రోజులు మంచివికావు. ఇంతకి ఎవరిదగ్గర పుచ్చుకున్నారు?’

‘మాయింటికి ఎదురుగుండా, ఒకావిడ ఉందిలెండి, కొద్దిగా పళ్లు ఎత్తుగా ఉంటాయ్, ఓ కాలు యీడుస్తూ నడుస్తుంది...’

‘బుగ్గమీద కాలినమచ్చ ఉంటుంది, ఆవిడేనా?’

‘అవునవును, నీకెలా తెలుసూ?’

‘ఆవిడ సుబ్బమ్మ కూతురేనండీ?’

‘అయ్యో, అలాగా, మరి మీరు కొనివ్వలేదుకదా, వారికి మరోపార ఎలావచ్చింది?’

‘అదే విచిత్రంగా ఉంది. మీకు యిచ్చిన పార ఎలాంటిది?’

‘పట్టుకొనే పిడిదగ్గిర అడ్డంగా మూడు గీతలూ...’

‘అయ్యో... అది వారు మాకిచ్చిన పారేనండీ !!!’

‘మరి నీకిచ్చిన పార ఎవరు దొంగిలించినట్టు?’

★

## స్వయంవరాలు

(13-వ పేజీ తరువాయి)

విడచి ఉండలేదురా. అమ్మమాత్రం ఉండగలదా? ఊరికే అలాగ భయపెట్టాడు’ అ నభయం ఇచ్చాడు మామయ్య. రాధాకృష్ణ పరమ సంతృప్తి చెందాడు.

మరునాడు ప్రొద్దున్న తండ్రీ కూతురుల మధ్య రగడ జరుగుతున్న విషయం గుర్తించాడు రాధాకృష్ణ. కామాక్షి ఏడుస్తోంది. అతని కేమీ అర్థమయింది గాదు. ‘సంగతేమిట’ నడుగకుండా బయటకు పోయాడు.

అతను తిరిగి వచ్చేసరికి రత్నం కేకలు వేస్తున్నాడు.

‘ఇంతకీ నువ్వు రాధాకృష్ణను పెళ్ళాడనంటావ్? పిచ్చి బాగా ముదిరింది. అసలు నిన్నింతవఅకూ చదివించటం నాతప్పు. మీ అమ్మ రణగోల పెడితే ఒప్పుకున్నాను. ఇప్పుడది నాకొంప తీసింది. రాజారావుతో పోతావా? వాడిని నువ్వు ప్రేమించట మేమిటి? వాడు నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాడనుకున్నావా? దొంగపీనుగ. ఆశ తీరగానే వదిలేస్తాడు. పాడుకాలం! ఎంత అక్రమంగా ఉందీ వ్యవహారం’

‘ఆయ నలాంటివారు కారు నాన్నా. నన్ను స్వయంగా వచ్చి వివాహం చేసుకుంటారు మూడు. ఆ కోతిమొహాన్నెవరు కట్టుకుంటాడు?’ అనంటోంది కామాక్షి ఏడుస్తూ.

రాధాకృష్ణ తండ్రి ముందున్న సైకాలజీ పాఠం గుర్తుకొచ్చిం దతనికి. నాలిక్కరచుకున్నాడు. తన సౌందర్యానికి తానే మురిసిపోయేవాడు. ఒకమాటు డ్రామాలో వేషం వేయవలసివస్తే తనకు ‘మేకప్’ అక్కర్లేదన్నారు. అటువంటి తన్ను కామాక్షి ‘కోతిమొహం’ మంది. అతని ముఖకళ మారింది. ఆశారేఖలు నిరాశారేఖలయ్యాయి. తండ్రితో పోట్లాడటమొకటే మిగులయినట్లు కనపడింది. తన కింత పరాభవం జరుగుతుందనుకోలే దతను. కామాక్షి తను కోరటమే తడవుగా కాళ్ళమీద వచ్చి వ్రాలుతుందనుకున్నాడు. కాని ఆ కలలన్నీ పగటి కలలయ్యాయి. అతనికి కామాక్షిమీద కోపం ముంచుకొచ్చింది. తక్షణం రైల్వేస్టేషనుకు బయలుదేరాడు.

అతను రైల్వేస్టేషన్ చేరుకున్న అరగంటకు కామాక్షిచెల్లెలు అతని యెదుట ప్రత్యక్షమయింది.

‘మీకీ ఉత్తరం ఇచ్చి రమ్మన్నది మా అక్కయ్య’ అనీ ఉత్తరం అందిచ్చి వెళ్ళిపోయింది. అతనాత్రంగా ఉత్తరం విప్పి చదివాడు. తను రాజారావును మనస్ఫూర్తిగా ప్రేమిస్తోందని, తన ప్రేమను రాధాకృష్ణ ధ్వంసం చేస్తున్నాడని, అలాగ చేయటం చదువుకున్నవాడికర్తవ్యం కాదని, నాన్నను ఒప్పించి ఎలాగయినా రాజారావుకు తనకు వివాహం జరిగేటట్టు చూడమని మొరపెట్టుకుంది కామాక్షి. రాధాకృష్ణ ఉత్తరం మడిచి జేబులో పెట్టాడు. మరి ఐదునిమిషాల్లో ధూమశకటం వచ్చింది. తన స్వగ్రామానికి బయలుదేరాడు.

అతని మెదడంతా ఆలోచనలతో నిండి ఉంది. తలచినపని సాగలేదు. కామాక్షిని పెళ్ళిచేసికొని మామయ్యనెత్తిమీది బరువు దింపుదామనుకున్నాడు. కాని అక్కడ కథ అడ్డం తిరిగింది. ఇక తండ్రి అంగీకారానికి తలవంచటమే మంచిది. అతని హృదయం జానకి గుణగణాలను రూపురేఖలను పరిశీలించింది. చివరి కామెను తన అర్ధాంగిగా చేసుకోవటానికి నిర్ణయించాడు.

ఇంటికి రావటంతో రాధాకృష్ణ తండ్రి ముఖం వాడి ఉండటం గమనించాడు. అందుకు కారణం తన ప్రవర్తనని ఊహించాడు.

‘చూశావురా! ఎంత పనయిందో! నిక్షేపంలాంటి సంబంధంకాస్తా ఎగిరిపోయింది. ఈ కాలపు వాళ్ళంతా ఇంతేననుకో. ఇన్నాళ్ళూ తల్లిదండ్రులు ఏది చెప్తే అది వినేవారు. ఇప్పుడో! అందరికీ స్వతంత్రం వచ్చేసింది. ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తున్నారు’ అన్నారు రామయ్యగారు

‘ఎవరు నాన్నా అలాగ ప్రవర్తించింది?’

‘ఎదురుగా కనిపిస్తున్న నువ్వొకడివి. మెదడులో ఒకటే మెదల్తోంది. ఇంకా ఎంతమందో!’ రాధాకృష్ణకేమీ అర్థమయిందికాదు.

‘జానకి నిన్ను చేసుకోవటానికి అంగీకరించలేదట్రా. సుందరంగారు ఆమె అభిప్రాయాన్ని కనుక్కోకుండానే నాన్నకు మాట యిచ్చారటరా. ఆయన పాతకాలం మనిషి. తండ్రి అభిప్రాయానికి సంతానం తలొగ్గుతుందని అనుకున్నారు. జానకి అంగీకరించలేదనేసరికి నాన్నకు కోపం వచ్చి ‘అప్సరసలాంటి పిల్ల మా కామాక్షి. ఆమెను తీసుకువచ్చి నా కొడుకుకు పెళ్ళి చేస్తాను’ అన్నారుట. ఇక నీఅభిప్రాయం నెరవేరినట్టే. పంతులు రావాలి. ముహూర్తం పెట్టాలి. అంతే తరువాయి.’ అని శుభవార్తను బయటకు వదిలింది కాంతమ్మ.

రాధాకృష్ణ ఏమీ అనలేక దిగ్భ్రమ చెంది కుర్చీలో కూలబడ్డాడు. ★

కార్తికుడు బూతుపంచాంగంతో నోరు పారవేసుకుంటున్నాడు. ఒక ఆంగ్లో ఇండియన్ లేడీ మహిళాస్వాతంత్ర్యాన్ని రుజువు చేయాలనేమో, వీళ్ళందరినీ త్రోసుకొని బస్సు ఎక్కబోవడంలో చౌకబారు సిల్కుగౌను పర్రున చిరిగింది. దానితో ఆ లేడీ కాళీరూపం దాల్చిందంటే నమ్మండి. నా వారసులందరినీ, "ఇడియట్సు...బ్రూట్స్" అని శపిస్తూ చేసేది లేక పక్కకు తప్పుకుంది. ఇదేలాగూ మనకు లాభంలేదని నేను అలాగే నిలబడ్డాను. ఈ నిలబడడంలో మాత్రం అంతరార్థం లేదా అంటారేమో? లేకేం?... ఈ తెగిన చెప్పులజోడుతో బస్సెక్కడం, అందులో ఇంత గుంపులోనా చెప్పండి. మళ్లీ బస్సువచ్చేసరికి కనీసం అర్ధగంటైనా పడుతుంది. ఉస్సురుమంటూ పక్కకు తిరిగి చూసేసరికి ఆ సోగకండ్ల సుందరి కూడా అక్కడే నిలబడి ఉంది.

తెగిన చెప్పులను ఈడ్చుకురావడంవల్ల కాళ్ళనొప్పులు పుట్టాయి. చెప్పులమీద అమితంగా కోపంవచ్చి ఒక్కసారి వాటివైపు తీక్షణంగా చూశాను. అదే సమయానికి ఆమె నా కాళ్ళవంక చూసి, వచ్చేనవ్వును ఆపుకుంటానికి చేరుమాలను నోటికి అడ్డంపెట్టుకుంది. నావంక చూస్తూ. నాకు సిగ్గు అనిపించింది. ఎక్కడలేని అభిమానం వచ్చింది. కానీ చేసేదేముందీ?...ఆమె ఖరీదైన బట్టలు, శాండల్సు చూసి, సిగ్గుపడితేమటుకు క్రొత్తవి ఎలా వస్తాయి నాకు? సంసారభారం ఎక్కువ అవడంతో ఇటువంటి అభిమానాలు ఏనాడో వదిలేశా. మాసికలు వేసినబట్టలు, తెగిన జోళ్లూ వేసుకుంటానికి జీవితం అలవాటుపడింది. అందుకని నాకా విచారంలేదు. పైగా నేనూ ఆమెతోపాటు నవ్వి, "ఒకసారి న్యూసుపేపరు ఇవ్వం"డని ఇంగ్లీషులోనే అడిగా. ఆమె అందించింది. దరహాసిని, బి. ఏ. అని గుండ్రంగా చెక్కబడిన అక్షరాలను చూసి నాకళ్ళు జిగేలుమన్నాయి. మాయదారి మనసు ఊరుకుంటుందా? "దరహాసినీ, మధురభాషిణీ, నవనవోన్మేషిణీ" అని నాలో ఏదో తీయని రాగం బయలుదేరింది. మా శ్రీమతి ప్రచండరూపం స్ఫురణకు వచ్చి, అప్పటికప్పుడే పరాయి స్త్రీకదా అని మనసులోనే లెంపలువేసుకొని, "అప్రాప్తమనోహరి" అనే పేరుతో ఒక ఖండకావ్యాన్ని వ్రాసి, నాతోపాటు ప్రజలను కూడా విలాపింపచేద్దామనుకున్నా. కాని ఇంతకుముందే ఇదే శీర్షికతో ఎవరో వ్రాసినట్టు జ్ఞాపకం వచ్చి, ఛా...ఒకరు వాడిన పేరు మనం ఎందుకు వాడాలని ఆ ఉద్దేశాన్ని విత్‌డ్రా చేశా.

ఇంతలో రెండంతస్తుల బస్సు వచ్చి ఆగింది. వారసులు చాలామంది తగ్గడంవల్ల కుస్తీపట్టకుండానే బస్సు ఎక్కుతున్నాం. కొంతమంది ఎక్కాక ముందు దరహాసిని ఎక్కండి. నేను ఎక్కబోతూంటే, "క్రింద సీట్లు లేవు మీదంతస్తుకు వెళ్ళ"మన్నాడు కండక్టరు, ఓ పెద్ద నియంతలా పోజుపెట్టి. ఎక్కడైతేనేం, అసలు సీటు ఉందని చెప్పినందుకు కండక్టరుకు ధన్యవాదాలు తెల్పాల్సిందే కానీ. ఆ తొందరలో చకచకా మీదిఅంతస్తుకు ఎక్కాను.

రాణీగంజిలో బస్సు ఆగింది. అంతా దిగుతున్నారు. నేను మటుకు వెంటనే దిగకుండా ఆలోచనలో పడ్డాను. చూస్తూ చూస్తూ చెప్పులు బస్సులో వదిలిపోవడానికి మనసు ఒప్పుకోవడంలేదు. పాపం! రెండుసంవత్సరాలనుంచి నాపాదాలను ఆశ్రయించుకొని ఉన్నాయనే మమకారం నన్ను పీడించింది. ఇందులో నీ స్వార్థం లేదా అంటారేమో, లేకేం బోలెడంత వుంది. ఈ నెలలో బడ్జెట్టు అనుకున్నదానికంటే దాటేపోయింది. మళ్ళీ ఇహ చెప్పులకు ఎక్కడనుంచి తేనూ? అందువల్ల మళ్లీకాస్త రిపేరీ చేయిస్తే అధమం మరో నెలైనా గడవవచ్చని, పైనెలలో ఎలాగో తంటాలు పడి కొందామనీ నిర్ణయించుకున్నాను. కాని, రిపేరీ చేయించడానికి కూడా వీలులేకుండా ఉన్నాయి. ఊఁ... అంతగా అయితే, ఇంకో అణా ఆ చెప్పుల దర్జీవాడికే ఇచ్చి గట్టిగా ప్రయత్నిస్తే సరి అనుకున్నా. అసలు ఇప్పుడు బస్సు దిగి ఇంటిదాకా నడవడం ఎలాగా అనిపించింది. చీకటి పడుతున్నదిగా, అయినా ఇప్పుడు చెప్పులున్నదీ లేనిదీ ఎవరు చూడొచ్చారులే అని మనస్సుకు సరిపెట్టుకున్నా.



దరహాసిని న్యూసుపేపరు బుద్ధిపూర్వకంగా కాకపోయినా, అవసరాన్నిబట్టి కొట్టివేయాలనుకున్నా. ఆమె ఈపాటికి దిగిపోయేఉంటుందని చెప్పులజోడు ఆ న్యూసుపేపరులో కట్టి, అందరికంటే చివరికే దిగాను. గుండె దడదడ కొట్టుకుంది, దరహాసిని అక్కడే నిలబడటంచూసి. ఒకసారి నా కాళ్లవంకా ఒకసారి పేపరులో కట్టిపట్టుకున్న చెప్పులజోడువంకా చూసి నవ్వింది. మనస్సు కలుక్కుమంది నాకు. సిగ్గుతో అభిమానంతో ఆ కారుకింద పడి చావాల్సిందే కానీ, ఈ ఘటం డెబ్భై అయిదేళ్లదాకా గ్యారంటీ అని ఒక జ్యోతిష్కుడు చెప్పడంవల్ల చావలేకపోయాను. తడబడే మాటలతో, "క్షమించాలి......పేపరు" అన్నాను. "పరవాలేదు లెండి" అంటూ ఆమె సిద్ధంగా ఉన్న స్టేషన్ బస్సులో ఎక్కింది. అమ్మయ్య బ్రతుకుజీవుడా అనుకున్నాను. మొదట, నలుగురిలో ఎంత రభస కావాల్సివస్తుందోనని భయపడ్డాను. అందులో ఆమె బి. ఏ. చదువుకున్న మహిళ. ఛడామడ నాలుగూ తిడితే నా గతేంకానూ?...ఇంకా నయం...ఇవాళ లేచినవేళ మంచిదేఅయింది. అయినా ఇంత స్వల్పవిషయానికే ఆమె తొందర పడకుండా నా పిచ్చికాని.

తెలిసినవా ళెవరైనా కనబడతారేమో ఎలారా భగవంతుడా అనుకొంటూ, ఫుట్‌పాత్ మీదుగా నడుస్తున్నాను, పరాగ్గా తలొంచుకొని. కాని, అనుకున్నవన్నీ సక్రమంగా జరిగేడిస్తే ఇహ లేనిదేముందీ? నేనూ ఈపాటికి కనీసం, ఏ.ఎమ్. ఎల్. ఏ. నో అయేవాణ్ణి. "ఏంరోయ్!......నిటారుగా దిక్కులు చూస్తూ నడిచేవాడివి తలొంచుకొనినడుస్తున్నావేం ఖర్మంరా?" అన్నాడు శాస్త్రి వెనుకనుంచి వచ్చిభుజం మీద చేయివేస్తూ. నా ఒళ్లు మండిపోయిందంటే నమ్మండి. అమాంతం చాచి ఒక్క చెంపదెబ్బ తీద్దామా అన్నంత ఉడుకుమోతుతనం వచ్చినమాట నిజమే. కానీ, వాడి కండలు తిరిగిన శరీరం చూచి గప్‌చిప్‌గా ఊరుకున్నా. లేకపోతే వాడికిదేనా సమయం చెప్పండి నన్ను పరామ

(42-వ పేజీ చూడండి)

పెద్దకథ

# జీవితరేఖ

"ప్రేమ"

(గత సంచిక తరువాయి)

"పాపం ప్రయత్నిస్తావేం?" కళ్ళు చిట్లించి అన్నాడధికారి.

"లేదుసార్. రేపటినుంచి పెందరాళే వస్తాను."

"రేపటి సంగతి తరవాతాలోచిద్దాం. ముందివాళెందు కాలస్యమైందని అడుగుతున్నాను." అన్నాడాయన గద్దిస్తూ.

గోపాలం తల వంచుకుని కాలిబొటన వేలితో నేలని రాస్తూ చేతులు కట్టుకు నుంచున్నాడు. కొంతసేపటికి మెల్లిగా అన్నాడతను.

"మీల్స్ తీసుకోటం కొంచె మాలస్యమయింది సార్..." అధికారి అతనివంక కాసేపు గుర్రుగా చూసి మళ్ళా తనపనిలో నిమగ్నుడయ్యాడు.

గోపాలం లోపలికి వెళ్లి తన సీటులో కూర్చుని పని చేసుకోటం ప్రారంభించాడు.

అతని కారోజు పనిమీదికి మనసు పోటం లేదు. అతన్ని విసుగూ, విచారం ఆవరించాయి.

కాని ఆనాడే అతన్ని ఆఫీసరు అసలు ఆఫీసు వేళకంటె మరోగంట ఎక్కువ కూచోపెట్టి మరీ చేయించాడు పని.

"ఏమైనా ఇవ్వాళ నేను వెళ్లను." అన్నాడు రఘు చిందులు తొక్కుతూ.

"మా బాబువికదూ, ఇవ్వాళ ఒక్కరోజూ వెళ్ళు." అంది రాధ.

"ఏరోజు కారోజు ఇవాళ ఒక్కరోజునే అంటున్నావ్. అంత దూరం అనవసరంగా కాళ్ళు కొట్టుకుంటూ వెళ్ళటమే కాని ఒస్తుందా, పెడుతుందా?"

"ఇవాళ తప్పకుండా వస్తుందిగా."

"అలా నువ్వు ఏ రోజు అనలేదు కనక."

"నీకేమైనా కొనుక్కోటానికి అణా ఇస్తాను. ఇవ్వాళ ఒక్కరోజూ వెళ్ళిరావూ?" అంది రాధ బతిమాలుతూ.

"అణాకేమొస్తుంది?" అన్నాడతను మొఖం చిట్లించి.

"పోనీ బేడా ఇస్తాను. ఏం?"

"అయినా నాకు బోలెడంత 'హోం వర్కు' ఉంది. ఇప్పుడు పోస్టాఫీసుకెడితే ఆలెక్కలన్నీ ఎవరు చేస్తారు." అన్నాడు రఘు ఏమైనా వీల్లేదన్నట్టు.

"మరో అణా ఎక్కువిచ్చి ఆ 'హోం వర్కు' కూడా నేనే చేసిపెడతాలే పోయిరా."

గోపాలం దగ్గిర్నుంచి ఏమైనా ఉత్తరం వస్తుందేమోనని రోజూ ఆమె అతన్ని ఈ విధంగానే బతిమాలుతూ పోస్టుకి పంపుతోంది. కాని ఇంతవరకు అతని దగ్గిర్నుంచి ఏ విధమైన ఉత్తరమూ రాలేదు. తను ఈ ఊరువచ్చి మూడు వారాలు తిరిగినా అతని దగ్గిర్నించి జాబురాకపోవటంవల్ల ఆమెకేదో భయంగా ఉంది.

ఇక్కడ పరిస్థితులు చూస్తే విషమిస్తున్నాయి. ఆమెకీ వాతావరణం ఏమాత్రం సరిపడటల్లేదు. ఇంటికొచ్చిన ప్రతివారూ తన వంక నఖశిఖపర్యంతం ఎగతాళిగా చూసి, 'ఇరవైరోజుల్నుంచి ఇక్కడే ఉంటున్నావా' అంటు న్నట్టనిపించిందామెకి.

అక్కడతనా బాధలు భరించలేక ఏ రోజు కారోజు తనని రమ్మనో లేక అతనే వస్తున్నాననో రాస్తాడేమోనని ఎంతో ఆశగా ఎదురుచూస్తోందామె.

కొంత సేపటికి రఘుఎంతో సంతోషంతో ఇంట్లో అడుగుపెడుతూ, "అక్కయ్యోయ్, బావదగ్గిర్నుంచిఉత్తరం వచ్చిందేవ్." అని కేకేశాడు.

ఆవార్త విన్న రాధకి గుండె కొట్టుకోటం ఒక్కసారి ఆగిపోయినట్టనిపించింది. ఆనందంతో ఆమె ఒళ్ళు పరవళ్ళు తొక్కింది.

"నిజంగా! ఏదీ, ఇలా తే"

ఇక ఇక్కడితో తన బాధలు గట్టెక్కయనుకొందామె. మరీ వారంరోజుల్నుంచీ ఆమె పేరు ఊళ్ళో ఎందరినోళ్ళు ధ్యానించాయో ఒక్కసారి స్ఫురణకి తెచ్చుకునేటప్పటికి రాధ శరీరం గగుర్పొడిచింది.

మొదటివారం గడిచినప్పుడు, "అతనింకా రాలేదేమమ్మా? అని తన తల్లిదండ్రులు ప్రశ్నిస్తే వీళ్ళకేం సమాధానం చెప్పాలో తనకి తెలీలేదు. అప్పటికీ ఆలోచించి, "ఏదైనా కొంపు కళ్ళారేమో" నంది. "పోనీ ఉత్తరమైనా రాయలేదేం?" అని మళ్ళీ వాళ్ళడిగినప్పుడు ఆమె గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్టయింది. అయినా కొంతసేపటికి—

"పనితొందరలో ఉండి రాసుండరు." అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

అప్పటినుంచీ ఇప్పటివరకూ వారికి తన మొఖం చూపించటానికామెకి కాస్త బెరుగ్గానే ఉంది. అందువల్ల సాధ్యమైనంతవరకు వారికి కనబడకుండా తప్పుకు తిరుగుతోంది.

మొన్నీ మధ్య ఎవరింటికో పేరంటానికి వెళ్ళినప్పుడు ఆ ఇల్లాళ్ళంతా ఆమెవైపు ఎగాదిగా పరిశీలనగా చూసి గుసగుసలు ప్రారంభించారు.

"ఎవరమ్మ యీ అమ్మాయని" ఒకామె అడుగుతే "మన కరణంగారమ్మాయి కాదూ?" అని మరొకామె అన్నప్పుడు వేరొకామె తన ముఖానే అడిగింది—

"ఏమమ్మాయ్, నువ్వొచ్చి చాలాకాలమైనట్టుంది ఇంకా వెళ్ళలేదూ?"

ఆ ప్రశ్న విన్న రాధకి మహా మండింది. "నీకేమైనా కళ్ళున్నాయా, లేవా? లేకపోతే ఎదుట కనబడుతున్నా 'ఇంకా వెళ్ళ

కార్మికుడు బూతుపంచాంగంతో నోరు పారవేసుకుంటున్నాడు. ఒక ఆంగ్లో ఇండియన్ లేడీ మహిళాస్వాతంత్ర్యాన్ని రుజువు చేయాలనేమో, వీళ్ళందరినీ తోసుకొని బస్సు ఎక్కబోవడంలో చౌకబారు సిల్కుగౌను పర్రున చిరిగింది. దానితో ఆ లేడీ కాళీరూపం దాల్చిందంటే నమ్మండి. నా వారసు లందరినీ, "ఇడియట్స్... బ్రూట్స్" అని శపిస్తూ చేసేది లేక పక్కకు తప్పుకుంది. ఇదలాగూ మనకు లాభంలేదని నేను అలాగే నిలబడ్డాను. ఈ నిలబడడంలో మాత్రం అంతరార్థం లేదా అంటారేమో? లేకేం?... ఈ తెగిన చెప్పులజోడుతో బస్సెక్కడం, అందులో ఇంత గుంపులోనా చెప్పండి. మళ్లీ బస్సువచ్చేసరికి కనీసం అర్ధగంటైనా పడుతుంది. ఉస్సురుమంటూ పక్కకు తిరిగి చూసేసరికి ఆ సోగకండ్ల సుందరి కూడా అక్కడే నిలబడి ఉంది.

తెగిన చెప్పులను ఈడ్చుకురావడంవల్ల కాళ్ళనొప్పులు పుట్టాయి. చెప్పులమీద అమితంగా కోపంవచ్చి ఒక్కసారి వాటివైపు తీక్ష్ణంగా చూశాను. అదే సమయానికి ఆమె నా కాళ్ళవంక చూసి, వచ్చేనవ్వును ఆపుకుంటానికి చేరుమాలను నోటికి అడ్డంపెట్టుకుంది. నావంక చూస్తూ. నాకు సిగ్గు అనిపించింది. ఎక్కడలేని అభిమానం వచ్చింది. కానీ చేసేదేముందీ?...ఆమె ఖరీదైన బట్టలు, శాండల్సు చూసి, సిగ్గుపడితేమటుకు క్రొత్తవి ఎలా వస్తాయి నాకు? సంసారభారం ఎక్కువ అవడంతో ఇటువంటి అభిమానాలు ఏనాడో వదిలేశా. మాసికలు వేసినబట్టలు, తెగిన జోళ్లూ వేసుకుంటానికి జీవితం అలవాటుపడింది. అందుకని నాకా విచారంలేదు. పైగా నేనూ ఆమెతోపాటు నవ్వి, "ఒకసారి న్యూసుపేపరు ఇవ్వం"డని ఇంగ్లీషులోనే అడిగా. ఆమె అందించింది. దరహాసిని, బి. ఏ. అని గుండ్రంగా చెక్కబడిన అక్షరాలను చూసి నాకళ్ళు జిగేలుమన్నాయి. మాయదారి మనసు ఊరుకుంటుందా? "దరహాసినీ, మధురభాషిణీ, నవనవోన్మేషిణీ" అని నాలో ఏదో తీయని రాగం బయలుదేరింది. మా శ్రీమతి ప్రచండరూపం స్ఫురణకు వచ్చి, అప్పటికప్పుడే పరాయి స్త్రీకదా అని మనసులోనే లెంపలువేసుకొని, "అప్రాప్తమనోహరి" అనే పేరుతో ఒక ఖండకావ్యాన్ని వ్రాసి, నాతోపాటు ప్రజలను కూడా విలాపింపచేద్దామనుకున్నా. కాని ఇంతకుముందే ఇదే శీర్షికతో ఎవరో వ్రాసినట్టు జ్ఞాపకం వచ్చి, ఛా...ఒకరు వాడిన పేరు మనం ఎందుకు వాడాలని ఆ ఉద్దేశాన్నే విత్‌డ్రా చేశా.

ఇంతలో రెండంతస్తుల బస్సు వచ్చి ఆగింది. వారసులు చాలామంది తగ్గడంవల్ల కుస్తీపట్టకుండానే బస్సు ఎక్కుతున్నాం. కొంతమంది ఎక్కాక ముందు దరహాసిని ఎక్కింది. నేను ఎక్కబోతూంటే, "క్రింద సీట్లు లేవు మీదంతస్తుకు వెళ్ళ"మన్నాడు కండక్టరు, ఓ పెద్ద నియంతలా పోజుపెట్టి. ఎక్కడైతేనేం, అసలు సీటు ఉందని చెప్పినందుకు కండక్టరుకు ధన్యవాదాలు తెల్పాల్సిందే కానీ. ఆ తొందరలో చకచకా మీదిఅంతస్తుకు ఎక్కాను.

రాణీగంజిలో బస్సు ఆగింది. అంతా దిగుతున్నారు. నేను మటుకు వెంటనే దిగకుండా ఆలోచనలో పడ్డాను. చూస్తూ చూస్తూ చెప్పులు బస్సులో వదిలిపోవడానికి మనసు వనకాడుతున్నది. పాపం! రెండుసంవత్సరాలనుంచి నాపాదాలను ఆశ్రయించుకొని ఉన్నాయనే మమకారం నన్ను పీడించింది. ఇందులో నీ స్వార్థం లేదా అంటారేమో, లేకేం బొచ్చెడంత వుంది. ఈ నెలలో బడ్జెట్టు అనుకున్నదానికంటే దాటేపోయింది. మళ్ళీ ఇహ చెప్పులకు ఎక్కడనుంచి తేనూ? అందువల్ల మళ్లీకాస్త రిపేరీ చేయిస్తే అధమం మరోనెలైనా గడపవచ్చుని, పైనెలలో ఎలాగో తంటాలు పడి కొందామనీ నిర్ణయించుకున్నాను. కాని, రిపేరీ చేయించడానికి కూడా వీలులేకుండా ఉన్నాయి. ఊఁ... అంతగా అయితే, ఇంకో అణా ఆ చెప్పుల దర్జీవాడికే ఇచ్చి గట్టిగా ప్రయత్నిస్తే సరి అనుకున్నా. అసలు ఇప్పుడు బస్సు దిగి ఇంటిదాకా నడవడం ఎలాగా అనిపించింది. చీకటి పడుతున్నదిగా, అయినా ఇప్పుడు చెప్పులున్నదీ లేనిదీ ఎవరు చూడొచ్చారులే అని మనస్సుకు సరిపెట్టుకున్నా.




దరహాసిని న్యూసుపేపరు బుద్ధిపూర్వకంగా కాకపోయినా, అవసరాన్నిబట్టి కొట్టివేయాలనుకున్నా. ఆమె ఈపాటికి దిగిపోయేఉంటుందని చెప్పులజోడు ఆ న్యూసుపేపరులో కట్టి, అందరికంటే చివరికే దిగాను. గుండె దడదడ కొట్టుకుంది, దరహాసిని అక్కడే నిలబడటంచూసి. ఒకసారి నా కాళ్లవంకా ఒకసారి పేపరులో కట్టిపట్టుకున్న చెప్పుల జోడువంకా చూసి నవ్వింది. మనస్సు కళుక్కుమంది నాకు. సిగ్గుతో అభిమానంతో ఆ కారుకింద పడి చావాల్సిందే కానీ, ఈ ఘటం డెబ్బై అయిదేళ్లదాకా గ్యారంటీ అని ఒక జ్యోతిష్కుడు చెప్పడంవల్ల చావలేకపోయాను. తడబడే మాటలతో, "క్షమించాలి......పేపరు" అన్నాను. "పరవాలేదు లెండి" అంటూ ఆమె సిద్ధంగా ఉన్న స్టేషన్ బస్సులో ఎక్కింది. అమ్మయ్య బ్రతుకుజీవుడా అనుకున్నాను. మొదట, నలుగురిలో ఎంత రభస కావాల్సివస్తుందోనని భయపడ్డాను. అందులో ఆమె బి. ఏ. చదువుకున్న మహిళ. ఛడామడ నాలుగూ తిడితే నా గతేంకానూ?...ఇంకా నయం...ఇవాళ లేచినవేళ మంచిదేఅయింది. అయినా ఇంత స్వల్పవిషయానికే ఆమె తొందర పడకుండా నా పిచ్చికాని.

తెలిసినవాళ్లెవరైనా కనబడతారేమో ఎలారా భగవంతుడా అనుకొంటూ, ఫుట్‌పాత్ మీదుగా నడుస్తున్నాను, వరాగా తలొంచుకొని. కాని, అనుకున్నవన్నీ సక్రమంగా జరిగేడిస్తే ఇహ లేనిదేముందీ? నేనూ ఈపాటికి కనీసం, ఏ.ఎమ్. ఎల్. ఏ. నో అయేవాణ్ణి. "ఏంరోయ్!......నిటారుగా దిక్కులు చూస్తూ నడిచేవాడివి తలొంచుకొనినడుస్తున్నావేం ఖర్మంరా?" అన్నాడు శాస్త్రి వెనుకనుంచి వచ్చిభుజంమీద చేయివేస్తూ. నా ఒళ్లు మండిపోయిందంటే నమ్మండి. అమాంతం చాచి ఒక్క చెంపదెబ్బ తీద్దామా అన్నంత ఉడుకుమోతుతనం వచ్చినమాట నిజమే. కానీ, వాడి కండలు తిరిగిన శరీరం చూచి గప్‌చిప్‌గా ఊరుకున్నా. లేకపోతే వాడికేదైనా సమయం చెప్పండి నన్ను వరాము

(42-వ పేజీ చూడండి)

లేదూ' అనడుగుతావేం ?" అన్న మాటలు ఆమె నోటిచివరదాకా వచ్చాయి కాని బాగుండదని, "లేదండీ." అన్నదామె. అందుకామె ఎంతో విచారంగా, "అయ్యో ఎప్పుడో వెళ్ళిపోయా వనుకు న్నానే, ఇంకా ఎందుచేత వెళ్ళ లేదమ్మా ?" అంది.

అది విని రాధ బాధపడింది. 'తను రెండు రోజులు పుట్టింట్లోపడుంటే వీళ్ళింత సహించలేరేం ?" అనుకొందామె. అంతా 'ఎప్పుడు వెళ్ళిపోతావ్ ?' అని ప్రశ్నించేవారేగాని 'హాయిగా మరో రెండు రోజులుండిపో,' అన్న వాళ్ళింతవరకు తను ఈ ఊరువచ్చిన మూడు వారాలలో ఒక్కరు కూడా కనిపించలేదే.

ఆఖరికి తమ పనిమనిషికూడా తనంటే చులకనే. జానకితో తనసంగతి చెబుతున్నప్పుడు విన్నదో ఏమోగాని మొన్నోసారి మొగుడితో ఎవరితో "చిన్నమ్మగారింకా నిద్రలేవలేదల్లే ఉందే" అన్నప్పుడు "ఆవిడకేమయ్యా మొగుణ్ణొదిలి పెట్టొచ్చిన ముండ." అంటూ ఏదో చెబుతోంది రహస్యంగా. తనప్పుడు నిద్రనుంచి లేచి కిందికి మెట్లుదిగి వస్తూ వింది మాటలు. అప్పటినుంచీ ఆమెకీ ఊరు వొదిలిపెట్టి ఎప్పుడు పోతానా అని పీకుతోంది మనసులో. ఈ భావాలన్నీ ఒక్క క్షణంలో స్ఫురణకొచ్చాయామెకి. ఇటువంటి వింకెన్ని జరిగాయో, జరుగుతాయో...

"అబ్బా అప్పుడే ఇస్తానేమిటే ? ముందు నువ్విస్తానన్న మూడణాలూ, ఇవ్వాళ బావదగ్గిర్నుంచి నిజంగా ఉత్తరం వచ్చినందుకు మరో అణా కలిపి మొత్తం పావలా ఇస్తే అప్పుడిస్తాను." అన్నాడు రఘు నవ్వుతూ.

"అలాగే ఇస్తాలే ముందా ఉత్తరం ఇటివ్వు." అందామె.



"పాపం. ఎంతాశే. ఉత్తరం తీసుకుని పావలా ఎగ్గొడదామనుకున్నావు కదూ."

"కాదు. నిజంగా ఇస్తాను. ముందా ఉత్తరం ఇలా ఇవ్వు."

"అమ్మ. ముందు నువ్వే పావలా ఇవ్వు."

"అబ్బబ్బ. నన్ను వేధించకుండా త్వరగా ఇవ్వరా ఉత్తరం."

"అంత తొందరగా ఉంటే పావలా ఇచ్చేసి తీసుకో కూడదూ ?"

రాధ ఇంక అతనితో మాట్లాడలేక తన పెట్టెలోనుంచి ఓ పావలా తీసి అతనికిచ్చి ఆ ఉత్తరం తీసుకొని త్వరత్వరగా పైకి వెళ్ళిపోయింది.

"హోంవర్కు చేసిపెట్టావా ?" అన్న రఘు మాటనికూడా వినిపించుకోలేదామె.

రాధ కవరు గబగబా చింపి ఉత్తరం చదువుకుంది. అందులో ఇలా ఉంది-

ఇక్కడ నాకు హాయిగా జరిగిపోతోంది. రామమూర్తి రోజూ వస్తున్నాడు. ఈ అన్నం నావంటికి బాగానే సరిపడుతోంది. 'నీ కక్కడ సుఖంగా ఉంటే ఉండిపో. గోపాలం తనీలైనా

ఈ ఉత్తరం చదివిన రాధకి కోపమూ, దుఃఖమూ రెండూ సమపాళ్ళలో కలిగాయి. ఆమె ఇన్ని రోజులనుంచీ ఎదురు చూస్తున్న ముక్క అందులో ఒక్కటి కూడా లేదు.

నువ్విక్కడకి రాకపోతే పిల్లేదని రాయకపోయినా ఇక్కడికొస్తే బాగుంటుందని అతని ఉత్తరంలో రాసినట్టయితే ఆమె తక్షణం బయలుదేరి వెళ్ళేది. అందులో అదేమీ లేక నువ్వక్కడే ఉండిపో అని రాస్తే ఆమె ఏ మొహం పెట్టుకు వెడుతుంది?

అతనికి అన్నంకూడా బాగానే పడుతోందట. పైగా రామమూర్తికూడా రోజూ వస్తూఉంటే ఆయనకి కులాసాగా గడవక ఏంచేస్తుంది? రామమూర్తి ఓ తమాషా పురుషుడు. ఇతరుల్ని నవ్వించగలడు, ఏడ్పించగలడు. అనుకుందామె.

నిజంగా అక్కడతను పడుతున్న బాధ లామెకేం తెలుసు?

అసలు తన ఉత్తరం చదువుకునే అతకలారాశాడేమో ననిపించిందామెకి. తనలా రాయకపోతే అతనిలారాశేవాడా అనుకుందామె. తనా ఉత్తరం ఆ ప్రకారం రాశినందు కెంతో విచారించింది.

చివరికామె, 'కానీ ఇలా ఎంత కాలం గడుస్తుందో' అనుకుంది.

ఇంతలో జానకి మెట్లెక్కి పైకొచ్చింది. వాడిపోయిన రాధ వదనం చూసి మళ్ళీ ఏదో జరిగిందనుకుందామె. రాధ జానకి వచ్చిన సంగతే ఎరగదు. ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తోంది.

జానకి మెల్లగా "రాధా!" అని పిలిచింది కాని ఆమె పలకలేదు. ఈసారి కాస్త గట్టిగా "రాధా, రాధా" అని పిలిచింది. అయినా ఆమె పలకలేదు.

జానకి మొదటిసారి పిలిచినప్పుడే రాధ ఆలోచనలలో నుంచి ఉలిక్కిపడింది. ఇంతలో రెండోసారి పిలిచే సరికి మైకం పూర్తిగా వొదిలి జరిగిన సంఘటన తెలుసుకుంది. అందువల్ల ఆమె తన మొహం చూపించటానికి కిష్టపడక మెదలకుండా ఊరుకుంది.

తను రెండు సార్లు పిలిచినా రాధ పలకనందుకు జానకి కోపం నటించి అంది—

"ఇదే నా అమ్మ అతిథిని ఆదరించే విధానం." ఈసారికూడా రాధ పలుకలేదు.

"నీకంత ఇష్టం లేకపోతే వెళ్ళిపోతున్నాలేవే." అంది జానకి కాస్త తీవ్రంగా.

ఈ దెబ్బతో రాధకి జానకి నిజంగానే వెళ్ళిపోతుందేమో ననిపించి, "కూర్చో, జానకీ" అంది మెల్లగా.

జానకి అలసిపోయినట్టు "హమ్మయ్య, ఎంతసేపటికి" అని పక్కనున్న ఓకుర్చీలో కూర్చుంటూ, "అయితే ఏం జరిగిందీ, ఇలా ఉన్నావ్ ?" అని ప్రశ్నించింది.

రాధ ఏమీ మాట్లాడకుండా గోపాలం దగ్గిర్నుంచి వొచ్చిన ఉత్తరాన్ని ఆమె కందించింది.

జానకి అది చదువుకుని నవ్వుతూ "ఇంతే కదా," అంది.

జానకి ప్రవర్తన చూస్తున్నకొద్దీ రాధకి మండుతోంది. తను ఇంతసేపట్నుంచీ ఈ ఉత్తరం చూసి బాధపడుతూంటే జానకి దాన్ని చూసి 'ఇంతేకదా' అని తేలిగ్గా కొట్టిపేస్తుందేం ! అనుకొందామె. తను ఈబాధని అనుభవిస్తే తెలిసివస్తుంది. అని కూడా అనుకుందామె. ఇంకొకరైతే ఈ పరిస్థితిలో తన్ని ఇలా అంటే ఊరుకునేదికాదు. తనతో చిన్నప్పట్నుంచి స్కూల్ ఫైనల్ దాకా చదువుకుని ఎంతో స్నేహపాత్రంగా ఉంటున్న జానకి నేమీ అనలేక పోయిందామె. అందువల్ల ఆకోపాన్ని తన మొహంలోనే చూపెట్టిందామె.

రాధ ఈ భావాలు కనిపెట్టనట్టే జానకి తన ధోరణిలో నవ్వుతూ అంది.

"నేనిదివరకే చెప్పలా, 'ఆయనా కోపం మీద నయినా రాకుండా ఉండవచ్చు'నని. నువ్వప్పుడు, "చూద్దాంగా" అని పందెం వేశావ్. చూశావా, ఎవరు గెలిచారోను."

రాధ ఈ ధోరణిని సహించలేక

పోతోంది. దెబ్బతగిలినచోటే మరో ఎదురు దెబ్బతగిలినట్టు అసలే గాయపడ్డ ఆమె హృదయం మీద మరో బాకుపోటుపొడిచి నట్టయింది జానకి ఈవాలకం రాధకి...

ఆమె ఇక భరించలేక తల పట్టుకొని గబగబా మెట్లుదిగి కిందికి దిగిపోయింది. జానకికూడా తనలో తను ముసిముసిగా నవ్వుకుని "బాగా పనిచేసింద"నుకొంటూ ఆమెని అనుసరించింది.

* * *

రామమూర్తి వంటగదిలోనుంచి ఇంట్లోకి ప్రవేశిస్తూ పిలిచాడు—

"రారా గోపాలం వంట పూర్తయింది. భోంచేద్దాం ?"

"నాకేమీ ఆకలిగా లేదురా రామ్మూర్తీ."

"ఏడిచావ్ లే ఈ మాటలు కట్టిపెట్టి అన్నానికి నడు. అయినా ఏమిట్రా నీక్కీ దిగులు. నీ కాకలిగా లేకపోయినా నేను కష్టపడి వండినందుకే నా తినవచ్చును గదుట్రా."

"నిజంగా ఏ మాత్రం ఆకలిగా లేదు భాయీ.

"నోరుముయ్యరా రెండు మెతుకులు మింగలేకపోతావా. లేలే. అసలు అన్నం ముందు కూచుంటే ఆకలిగా లేకపోయినా అదె ఎగిరిపోతుంది."

అంటూ రామ్మూర్తి గోపాలం రెక్క పట్టుకు లాక్కెళ్లాడు.

"అదేమిట్రా ఒక్క ముద్దయినా ముట్టుకున్నావ్ గావ్. లేకపోతే ఒకవేళ నాతో చెప్పకుండా మళ్లా పెళ్లాంవచ్చేంత పర్యంతం నిరాహారదీక్ష పూనావా ఏమిటి ?"

దీనికి గోపాలం సిగ్గుపడుతూ.

"అబ్బే లేదు" అన్నాడు.

"మరైతే ఎందుకు తినవ్ ? ఈ వియోగంతో ఇంత విరాగిగా మారిపోయావేమిట్రా ?"

"ఏమిటో అది పక్కనుండి పెట్టకపోతే ముద్ద మింగుడుపడటంలేదు. దాని చేత్తో చేసినవంట ఎంత బాగుండకపోయినా తినగలిగే వాడిని. కాని..."

"పాపం. నా చేత్తోచేసిన వంట ఎంత బాగున్నా తినబుద్ధి పుట్టటంలేదు కదూ ?" అన్నాడు రామమూర్తి నొచ్చుకున్నట్టు నటిస్తూ.

"అబ్బే, అదికాదు. నా ఉద్దేశంలో..."

"నాకు తెలుసునులేరా నీ ఉద్దేశం."

గోపాలం స్నేహితుణ్ణి నొప్పిస్తున్నానే అన్న చింతతో తన హృదయానికి మరింత నొప్పిని కలుగచేసుకుంటున్నాడు. రామమూర్తి అది కనిపెట్టి అన్నాడు.

"నేనేదో నవ్వుతూ అన్నాను బ్రదర్. దానికేం బాధ పడకు. నా స్వభావం నీకు తెలియంది గనకనా" అని, "పోనీ ఇవ్వాళ ఆదివారమేగా ఆ ఊరువెళ్లి ఆవిడని తీసుకు రాకూడదూ ?" అన్నాడు.

"ఎప్పుడూ ?" అని ప్రశ్నించాడు గోపాలం కొంత ఆశగా చూస్తూ, అతని వంక.

"ఇవ్వాళ. పన్నెండున్నర కొక ట్రైనుందిగా దాని కెళ్ళచ్చు."

గోపాలం ఇంతలో ఏ మూహించాడో ఏమో, నిరుత్సాహంగా అన్నాడు—

"ఆఁ ! ఎందుకులెద్దూ" అని.

"ఏం ? మీ మామగారేమైనా అంటారేమోనని సందేహిస్తున్నావ్ ? మరేం పర్వాలేదులే. ఆయనకిజవాబు నేచెప్తాగా. గుడ్డలు సర్దుకోనే కూడా ఇంటికి వెళ్లి గుడ్డలు తెచ్చుకుంటా" అని రామమూర్తి వెళ్లిపోయాడు.

గోపాలం కాసేపేదో ఆలోచించి చివరికి గుడ్డలుతీసి సంచీలో కుక్కుతున్నాడు. ఇంతలో రామ్మూర్తివచ్చి—

"ఏరా ఇప్పుడా గుడ్డలు లాండ్రీ కేద్దామనా ?" అనడిగాడు, గోపాలం అతని వంక ఆశ్చర్యంగాచూస్తూ.

"ఏ గుడ్డలు ?" అన్నాడు.

"అవే. ఇప్పుడు నువ్వా సంచీలో పెడుతున్నవి."

"అబ్బె లేదు. అవి ఇప్పుడు ఊరికి తీసుకు వెళ్ళేవే. ఏం ? మాసిపోయాయా ?"

"మాసిపోటం కాదు. అన్నిమడతలు మడిచావ్, అవి కట్టుకోటానికి పనికొస్తాయా అని."

గోపాలం చిఱునవ్వు నవ్వుతూ—

"ఏమిటో మన కేమన్నా అలవాటా, పాడా. ఎప్పుడన్నా ఏదైనా ఊరికి వెడితే రాధే సర్దేది." అన్నాడు.

రామమూర్తి చేతికున్న వాచీవంక చూస్తూ,

"సరేలే త్వరగా కానీ, పన్నెండుమ్ముప్పావయింది." అన్నాడు.

గోపాలం అతని వంక సాశ్చర్యంగా చూసి—

అప్పుడే పన్నెండుమ్ముప్పావా ? పన్నెండున్నరకేగా ట్రైను. ఇంకే మందుతుంది."అన్నాడు.

"పన్నెండున్నరంటే సరిగ్గా పన్నెండున్నరకే వస్తుందీ ? కనీసం రెండుగంటలన్నా లేటు. అందులో ఇటునుంచి వెళ్ళేదీ, అటునుంచి వచ్చేదీ రెండూ ఇక్కడే క్రాసింగ్. పోనీ మరో స్టేషనులో క్రాస్ అవుతాయా అంటే ఇటు పక్క నాలుగుస్టేషన్లూ అటు పక్కో నాలుగుస్టేషన్లూ సింగిల్ లైనవేగా ?"

గోపాలం, "అవునే." అన్నాడు.

ఇద్దరూ బయలుదేరి స్టేషను చేరారు. రామమూర్తి చెప్పినట్టు ట్రెయిన్ సరిగ్గా గంటన్నర లేటు. వీళ్ళు వెళ్ళేటప్పటికి ఇంకా రైలురావటానికి అరగంట టైముంది.

ఆ అరగంటాప్లాటుఫారం మీద అటూ ఇటూ తిరగటంతో గడిపారిద్దరూ.

ఇంతలో వీ ళ్లెక్కవలసిన రైలు కాకుండా అటునుంచి వచ్చే ట్రెయిన్ ప్లాట్‌ఫారం మీదికి వచ్చి ఆగింది.

గోపాలం, రామమూర్తులు మనదేశపు ఆడవాళ్ళు సుఖా లెలా ఉంటాయో పరికిద్దామని లేడీస్ కంపార్టుమెంట్‌వైపు నడిచారు.

నడుస్తూ నడుస్తూన్న గోపాలం ఆ కంపార్టుమెంటు గేటుదగ్గర రాధ దిగుతూండటం చూసి ఒక్కసారి ఆగిపోయాడు. అదే సమయంలో రాధ కూడా అతనివంక చూసి అలాగే ఆగిపోయింది. రాధ దిగకుండా ఆగి వింతగా చూస్తూండటం చూసి జానకి లోపలినుంచి తల బయటికి పెట్టి చూసింది. ఆమెకి రామమూర్తి, గోపాలంలు కనిపించారు. వెంటనే ఆమె రాధని దించి తను కూడా కిందికి దిగింది.

రాధా గోపాలంలు కలుసుకున్నారు. ఆమె లోపలినుంచి పైకుబికుబికి వచ్చే ఆనందాన్నీ, దుఃఖాన్నీ పట్టలేక, "ఏమండీ ?" అని అతని వక్షంమీద వాలిపోయింది. అతను పూడిపోయిన గొంతుతో నీళ్ళలోనుంచి మాట్లాడుతున్నట్టు "రాధా" అని ఆమెని హృదయానికి హత్తుకున్నాడు.

రామమూర్తి వాళ్లిద్దర్నీ బండీలో కెక్కించి "ఇంక మేం వెళ్తాంరా ?" అన్నాడు. గోపాలం నవ్వుతూ, "ఏడిచావ్ లే" అని "అరవకుండా ఎక్కండి." అంటంతో రామమూర్తి జానకిలు కిమ్మనకుండా ఎక్కారందులో. ★

# ఎలెక్షన్ ఇంజనీరు

"అంగారకుడు"

ఈ మధ్య మావూళ్ళో ప్రజాస్వర్గపార్టీ అని ఒక కొత్త రాజకీయపక్షం స్థాపించబడ్డది. దిల్ ఖుష్ భవన్ రెండో అంతస్తులో గొప్ప స్టయిల్ లో ప్రారంభోత్సవం జరిగింది. గిరగిర తిరిగే ఫాన్లకింద, తళతళ లాడే పేట్లలో, ఘుమఘుమలాడే ఫలహారాల ఆరగింపుతో ఈ దరిద్ర భారతదేశంలో 'ప్రజాస్వర్గ' స్థాపనకు (మామూలు స్వర్గం కాదులెండి) శంకుస్థాపన జరిగింది. పార్టీతరఫున ఎన్నికల్లో నిలిచే అభ్యర్థులు కావాలని అన్ని పత్రికల్లోనూ ప్రకటింపబడ్డది.

''విశ్వరూపం' తరఫున ఆ ప్రారంభోత్సవాన్ని సందర్శించే భాగ్యం నాకు కూడా కలిగింది. ప్రభుత్వోద్యోగాల్లో అలవాటయిన అధికారాన్ని వొదిలిపెట్టి ఉండలేక, ఈతడవ అధికారంతో పాటుగా డబ్బుకూడా సేకరించ దలచుకున్న ఉద్యోగి సింహాలూ, వ్యాపార రంగంలో లక్షలు సంపాదించి, రాజకీయాలముద్దతుతో కోట్లు గడించ దలచుకున్న వర్తక మత్తేభాలూ, ఉన్న పార్టీలలో పాచిక పారక, బయటికి వచ్చి పంజా విసురుతున్న మురా శార్దూలాలూ సమావేశాన్ని అలంకరించారు. సమావేశం అయిన తరవాత కార్యదర్శిగారు ముఖ్యులందరినీ విలేఖరులకు పరిచయం చేశారు. అందులో చివరకు ఒకాయన్ను చూపించి "ఇదుగో వీరు మా ఎలెక్షన్ ఇంజనీరుగారండీ" అని అన్నారు.

వెంటనే అర్థంకాక, "ఆ! ఎవరండీ?" అని ప్రశ్నించాను.

"అంటే మా పార్టీకి ఎన్నికల సమయంలో సాంకేతిక సలహాదారుగా పని చేస్తారు" అని ఆయన విశదీకరించారు.

"అంటే ట్రూమన్ గారి నాలుగో పాయింట్ ప్లాన్ ప్రకారం వచ్చారా ఏమిటి?"

"లేదండీ. అయితే, అమెరికన్ మిత్ర సంఘం వారి సలహా మీద అక్కడికి వెళ్లి ప్రత్యేకశిక్షణ పొందివచ్చారు."

ఇంజనీరుగారు చిరునవ్వునవ్వారు. నేను ఆయనతో దోస్తీ కలిసి, తరవాత సావకాశంగా మాట్లాడుకునే ఏర్పాటు చేసుకున్నాను.

* * *

"నమస్కారం! పార్లమెంటరీ రాజ్యాంగ యంత్ర తంత్ర మంత్ర పాతాళభైరవా!" అన్నాను.

ఇంజనీరు చిరునవ్వుతో ఆహ్వానించి కుర్చీ చూపించాడు.

"మీ ప్రజాస్వర్గంలో మాబోటివాళ్ళను నిలవనిస్తారా, బాబూ?" అని కదలించాను.

"స్వర్గానికి ఎవరు వెళ్లదలచుకున్నా మా అభ్యంతరం లేదు," అని జవాబిచ్చాడాయన.

"నేను ప్రజాస్వర్గాన్ని గురించి అడుగుతున్నాను."

"నేను చెప్పేదికూడా దాన్ని గురించే."

"ఐతే, ప్రతిదానికీ ముందు 'ప్రజా' అని తగిలిస్తేనే కాని ఈ రోజుల్లో షోకు లేదా?"

"షోకు లేకకాదు. ఫోర్సు ఉండదు.

"మరి అందరూ 'ప్రజా' అని తగిలించుకుంటే తేడా ఏముంటుంది?"

"కావలసినంత ఉంటుంది. క-ఖ ప్రజా పార్టీ క-ఖ వర్గానికి చెందిన ప్రజలన్న మాట. చ-ఛ ప్రజా పార్టీ అంటే చ-ఛా వర్గపు ప్రజలే ఉంటారన్నమాట. ఏ వర్గం పేరూ చెప్పక పోతే సమయానుకూలంగా మార్పులు వస్తూ ఉంటయ్."

"అంటే బ్రిటిష్ లేబర్ పార్టీ వాళ్ళ శ్రేయోరాజ్యం మోస్తరన్నమాట."

"ఏం? దానికేమిటి?" అని ఆయన ప్రశ్నించాడు.

"అది ఎవరికి శ్రేయోరాజ్యం అన్నదే ప్రశ్న. మలయాలో నడిచేది బ్రిటిష్ పెట్టుబడిదార్లకూ, నేటివ్ సుల్తానులకూ శ్రేయోరాజ్యం. పర్షియాలో నడిచింది పెట్రోలు శ్రేష్ఠులకు శ్రేయోరాజ్యం. బ్రిటన్లో నడిచేది అమెరికన్ షావుకార్లకు శ్రేయోరాజ్యం"

"అదేమిటండీ?"

"లేకపోతే తమకు లాభసాటిగా ఉండేదైనా, తూర్పు యూరప్ దేశాల వ్యాపారాన్ని చెడగొట్టుకుని, అమెరికాతో వ్యాపారం జరిపి దేశాన్ని దివాలాతీయిస్తారటండీ? దేశంలో ధరలు మండిపోతుంటే వాటిని తగ్గించటానికి బదులు శక్తికి మించిన ఆయుధ నిర్మాణానికి పూనుకుంటారా?"

ఆయన మాట్లాడ లేదు.

అయితే మీ పార్టీలో స్వర్గానికి వెళ్లే ప్రజలేనా ఉండేది?"అన్నాను నవ్వుతూ.

"లేదు. ప్రజలకోసం ఈ దేశాన్ని స్వర్గరాజ్యంగా చేసేవాళ్లు."

పై స్వర్గానికి పోగా మిగిలిన వాళ్లకా?"

"కాదు. నచ్చనివాళ్లను అక్కడికి పంపగలిగే వాళ్లకు" అని ఆయన ఎదురు దెబ్బ తీశాడు.

"అసలు మీ లైను ఈ దేశంలో ఎప్పుడు ప్రారంభమయింది?"

"లార్డ్ రిపన్ లోకల్ బోర్డులను ఏర్పాటు చేసినప్పటినుంచీ ఎక్కడికక్కడ మాబోటివాళ్ళు బయల్దేరారు. కాని 1920 వరకూ మాకు పెద్ద పలుకుబడి ఉండేదికాదు. అప్పుడు ఇప్పుడున్నన్ని ఓట్లూ లేవు, ఇప్పుడున్నంత కష్టమూ లేదు."

"ఇప్పుడు ఉన్న కష్టం ఏమిటి? వెనక లేనిది ఏమిటి?"

"1920 వరకూ రాజకీయాధికారంవల్ల ధనం సంపాదించవచ్చునని జనంలో ఆట్టే మందికి తెలియదు. అధికారం అంటే కేవలం స్థితిమంతుడి డాబుకీ, దర్పానికీ ఒక లక్షణమనుకునేవాళ్లు జనం. అందువల్ల పదవులకు ఎక్కువ పోటీలు ఉండేవి కావు. ఉన్నా, ఎవళ్లెక్కువ జబర్దస్తీచేస్తే, ఎవళ్లెక్కువ మోతగా జల్సా చేయిస్తే, వాళ్లకెక్కువ వోట్లుపడేవి. ఆ తరవాత కొందరు ప్రభువులు వోటుకింత అని డబ్బిచ్చి జనాన్ని చెడగొట్టారు."

"చెడగొట్టట మేమిటండీ?"

"మరి ఏమనమంటారు? పవిత్రమయిన వోటుని డబ్బుకి అమ్ముకుంటే?"

"వోటుకి పవిత్రత ఏమిటండీ? అభ్యర్థులు మా దగ్గరకు వొచ్చేది మా వోటు పెట్టెలో పడేవరకేకదా! అది పూర్తయిన తరవాత మా మొహాలను చూసేదెవరు? వోటు చెయ్యి జారిన తరవాత ఎటూ లాభం లేదు కనక ముందే నాలుగు డబ్బులు చేసుకుంటే మంచిది కదా!"

"అయితే వోటుకి పవిత్రతే లేదంటారా?"

"పవిత్రతసంగతి నేను మాట్లాడను. కాని ప్రాధాన్యత లేకుండా పోయిందని మాత్రం అంటాను. మా వోటుకి విలువ ఉండాలంటే, మా మాటను అభ్యర్థి పాటించాలంటే, అతణ్ణి అవసరమయితే వెనక్కి పిలిపించే అవకాశం ఉండాలి."

"అయినా తమ ప్రతినిధులదగ్గర తామే డబ్బు వసూలు చేస్తే ఎటా?"

"మా ప్రతినిధులు మళ్లీ మాదగ్గర గూబలు మెలేసి వసూలు చేస్తారుగా!"

ఎలెక్షన్ ఇంజనీరు ఒక చిన్న నవ్వు నవ్వి, "తగ్గానులెండి, జనాన్ని చెడగొట్టటం అని అనను, నేర్పారు అని మాత్రం అంటాను. సరే. అది పెరిగిపోయి పెరిగిపోయి, అభ్యర్థులు తమ తాహతును చూసుకోకుండా వాగ్దానాలు చేయటం మొదలుపెట్టారు. అరిచేతిలో వైకుంఠం చూపిస్తానని ఒకాయన అంటే, బొందితో కైలాసానికే పంపిస్తానని ఇంకొకాయన అంటాడు."

"అయితే జనం వీటికే మోసపోతారా?"

"నమ్మినంత వరకే చాలు. ఉదాహరణకు కొంతమంది పుఱ్రచేతి పురాణాలను చూడండి. వాళ్ళు మాటలు చెప్పేటంత వరకూ అంతర్జాతీయ సామ్యవాదాన్ని ఏకరువు పెడతారు. కాని క్రియకు వచ్చినప్పుడు మాత్రం, జాతీయ మితవాదులే మెరుగనిపించేట్లుగా, అభివృద్ధినిరోధకుల చంకలకు ఎగబాకుతారు. మాటల్లో 'కీప్ టు ది లెఫ్ట్,' చేతల్లో 'కీప్ టుది రైట్'"

"దీన్నే అంటారు, ఈచేత చేసింది ఆ చేతికి తెలియదని."

"మీరేమన్నా అనండి. వాళ్లకు కావలసిందల్లా కొన్ని వోట్లు దొరకటమే. అట్లా కనక చెపితే ఎడమపక్కగా నడుద్దామనుకునే వాళ్ల వోట్లు కొన్ని దొరకవచ్చు."

"అంటే వామపక్షాలకు వొచ్చే వోట్లను చీలదియటమేగా?"

"ఉన్న వోట్లేమో ఉంటయ్ కాని మార్పు ఉండదుకదా! వాటిని చీలదీయకపోతే మనకు వొచ్చేమార్గం ఏమిటి? వామపక్షమో, దక్షిణపక్షమో, ఎవరికి వారే యమునాతీరే."

"అట్లా అనబోకండి. బలహీనమైన పార్టీలు అనేకం కలిసి బలమైన పార్టీలను ఓడించాలని ప్రయత్నిస్తున్నయ్‌గా."

"మూల సూత్రాల్లో ఏకీభవించే పార్టీలకు పొంతన కుదురుతుంది కాని, అట్లా లేనివాటికి ఎన్నికల్లో మటుకు ఒద్దిక వీలు పడుతుందిటండీ?"

"లక్షణంగా కుదురుతున్నది. లేకపోతే ఒక్కొక్క ప్రాంతంలో ఇన్నేసి కొత్త పార్టీలు దేనికండీ?"

"దానికి కారణం ఇది. ప్రజాస్వామ్యానికీ, నియంతృత్వానికీ భేదం ఏమిటి? పబ్లిక్‌గా నిలబడినా ప్రభుత్వాన్ని విమర్శించే హక్కు నాకు ఉంటే నేను ప్రజాస్వామ్యంలో ఉన్నానన్న మాట, లేకపోతే కాదన్నమాట. అందుకోసం శాసనసభలో కూడా ప్రభుత్వాన్ని విమర్శించేందుకు కొన్ని పార్టీలు ఉండాలి."

"కాని ఏమయినా నాలుగు వోట్లు వచ్చేచోట అర్థం ఉన్నది కాని, ఆ అవకాశం ఏకోశానా లేనిచోట్ల కొత్త పార్టీలను పెట్టి హంగామా చేయటంలో 'కిటుకు' ఏమిటి?"

"ఆఁ! కిటుకు ఏముంది? ఏదో ఉడతాభక్తితో పార్లమెంటరీ రాజ్యాంగానికి ఒక కోపు పడదామనే."

"మీరేదో మసిపూసి మారేడుకాయ చేస్తున్నారు. సక్రమ విమర్శనల్తో ప్రజాస్వామ్యాన్ని కాపాడదలచుకున్న వాళ్ళు స్వతంత్ర అభ్యర్థులుగానే నిలబడొచ్చును కదా! జనం వోటుచేసేది వాళ్ళ వ్యక్తిత్వాన్ని పట్టేకాని కొత్తగా పుట్టిన పార్టీ పేరుని పట్టికాదుగా!"

ఎలెక్షన్ ఇంజనీర్ ఒక్కసారి పళ్ళు ఇకిలించాడు.

"మీరు వేసిన ప్రశ్న మా వ్యాపార రహస్యానికి సంబంధించినది. అయినా, మీ రంతగా అడుగుతున్నారు కనక చెపుతున్నాను. ఈ చిల్లర పార్టీలను పెట్టే వాళ్లూ, చేరేవాళ్లూ కూడా అపర భస్మాసురులని చెప్పొచ్చు. ఒకడి నెత్తిన ఒకడు చేయిపెట్టాలని చూస్తూ, చివరకు అంతా కలిసి జనం నెత్తిన చెయి పెడతారు."

"అంటే ఏం చేస్తారు?"

"అసలు పార్టీ అంటూ పెట్టిన ప్రబుద్ధుడు 'ఇదిగో నా చేతిలో ఇన్ని వోట్లున్నయ్, ఏమంటారు?' అని పెద్ద పార్టీలతో బేరం పెడతాడు. ఒక్కొక్క వోటుకీ విడివిడిగా వొచ్చే ధరకన్నా,

(41-వ పేజీ చూడండి))




# తేటగీతులు

★

"మధుశ్రీ"

### అమ్మ

అమ్మకన్నులలోనొక కమ్మదనము;
అమ్మ పల్కులలోన ప్రేమామృతమ్ము,
అమ్మ ఎదలోననంత క్షమాగుణమ్ము;
అమ్మ వంటిది లేదు విశ్వమ్ములోన.
ఎన్ని సారులో తొలగిపోయితిని తల్లి!
అతిపవిత్రమౌ నీదు స్నేహమ్మునుండి.
అన్ని సారులు నన్ను వెన్నాడి వెదకి
గుండెలోపల నను దాచుకొంటివీవు.

### జాబిల్లి

వెన్నెలల్ వెదజల్లుజాబిల్లి తేడ!
రమ్మురారమ్ము మేఘాల రథముపైన.
తెమ్ము తేతెమ్ము నీలోని తీయ తేనె.
తెచ్చి మాచిట్టి పాపాయికిచ్చి పొమ్ము.

# జంతువులు - పక్షులు

## లేడి

లేళ్లు ఇండియా, సింహళ దేశాల్లో నివసిస్తాయి. సుందరమైన ఆకారం. వంటిమీద తెల్లని చుక్కలుంటాయి. చిలవలు పలవలుగా చీలిన కొమ్ములుంటాయి. సాధారణంగా ఏడాది కొకసారి పాత కొమ్ములను వదిలి కొత్తవాటిని పెంచుకుంటాయి. లేళ్లను వేటాడ్డం బహు తేలికంటారు. బాగా పిరికి జంతువులు. కళ్లు ఎప్పుడు చూసినా బెదురుతున్నట్లు వుంటాయి. మన పూర్వీకవులు ఆడవాళ్లకు అందమైన కళ్లు ఉన్నాయని వర్ణించాల్సి వచ్చినప్పుడు లేడికళ్లతో పోల్చేవారు. వీటి గర్భధారణకాలం 7 లేక 8 నెలలు. 11 నుండి 23 ఏళ్ల వరకూ బతికగలవు.



లేడి

## ఏనుగు

భూమిమీద సంచరించే జంతువులన్నిటిలోకీ పెద్దదీ, బలిష్ఠమైనదీ ఏనుగు. దీని తెలివితేటలు అమోఘం. నీళ్లలో అతి వేగంగా ఈదగలదు. ఎంతనిడుపైన కొండలనైనా ఎక్కగలదు, దిగగలదు. ప్రస్తుతం బ్రతికివున్నవి రెండురకాల ఏనుగులు. ఒకటి ఆసియా ఏనుగు, మరొకటి ఆఫ్రికా ఏనుగు. ఈ రెండిటికీ ఆకారంలోనే గాక అలవాట్లలో కూడా చాలా తేడాఉన్నది. ఆఫ్రికా ఏనుగుచెవులు విశాలమైనవి. తల, రెండు చెవులు కలిపి పదిఅడుగుల దాకా పొడుగుంటాయి. ఆడ, మగ ఏనుగులు రెంటికీ దంతాలుంటాయి. బాగా పెరిగినదంతాలు 6, 7 అడు



ఏనుగులు

గులపొడుగు, 80 నుండి 120 పౌనుల వరకూ బరువు ఉంటాయి. ఆఫ్రికా ఏనుగులు 11 అడుగుల ఎత్తుకూడా పెరగగలవు.

ఇండియాలోని ఏనుగుల్లో మగ వాటికే పెద్దపెద్ద దంతాలుంటాయి గాని ఆడవాటి కుండవు. అవైనా అయిదడుగులకంటె పొడుగుగాని 70 పౌనులకంటె బరువుగాని ఉండవు. కళ్లుఆఫ్రికా ఏనుగులకళ్ల కంటె చిన్నవి. ఎత్తునగటున 9 అడుగులుంటుంది. ఆడఏనుగులు ఇంకా పొట్టి. ఆఫ్రికా ఏనుగుకు వీపు పల్లంగా వుంటుంది. ఇండియాలోని ఏనుగుకు వీపుపై మూపురంవలె ఎత్తుగా వుంటుంది. పదడుగుల ఎత్తున్న ఆఫ్రికన్ ఏనుగు 9860 పౌనుల బరువుంటుంది. ఎనిమిదడుగుల ఎత్తున్న మనదేశపు ఏనుగు సాధారణంగా 6700 నుండి 7000 పౌనులవరకూ బరువు తూగుతుంది.

ఏనుగు గర్భధారణకాలం 20, 21 నెలలుపైగా వుంటుంది. 55 నుండి 70 ఏళ్లవరకూ జీవించగలదు. ఇది పరిగెత్తలేదు,దూకలేదు. కాని నడకలోనే గంటకు 25 మైళ్ల వేగాన్ని కూడా అందుకోగలదు.

## నీలపు జింక

హిమాలయాల నుండి మైసూరు దక్షిణాన అరణ్యాల వరకూ అన్నిచోట్లా ఈ మృగం కనిపిస్తుంది. 4½ అడుగుల ఎత్తుంటుంది. బుగ్గలమీద గిట్టలకు పైన తెల్లటి మచ్చలుంటాయి. మగవాటికి మాత్రమే కొమ్ములుంటాయి. అవైనాబహు చిన్నవి. ఈజింకలు 50, 60 మైళ్లవేగంతో పరిగెత్త గలవు.



## తెల్లహంసలు

ఈ హంసలు అన్ని దేశాల్లోనూ కనిపిస్తాయి. ముఖ్యంగా డెన్మార్కు— తూర్పు యూరపు, మంగోలియా, ఇ౦డియాలో తూర్పుభాగాల్లోను ఎక్కువగా ఉన్నాయి. వీటి ఈకలు చాల తెల్లనివి. ముక్కు నారింజ రంగు; ముక్కు పైభాగం నల్లగా ఉంటుంది. వీటినడక ఒయ్యారమైనది. మంచితీవి,అతిశయం కనిపిస్తుంది

ఈ హంసలు గంటకు 55 మైళ్ళ వేగంతో ఎగురగలవు. 14 నుండి 25 ఏళ్లవరకూ బ్రతకగలవు. ఆడపక్షి గర్భంధరించి ఉన్నంతకాలం మగపక్షే దాన్ని సంరక్షిస్తూ వుంటుంది. మనదేశంలో ప్రాచీన కవులకు ఇష్టమైన పక్షులలో హంస ఒకటి. నల దమయంతులకు పెళ్లి రాయబారాలు నడిపింది హంసే.



నీలపు జింక




(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్సు,
ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

జరిగినకథ :

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతని పెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సిలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్కగ్రామానికి పారిపోయాము. పార్సిలును మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధన నిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము. జమీందారుగారొక ఓడను సిద్ధం చేశారు. స్మాలెట్ అనే అతన్ని కెప్టెనుగాను, లాంగ్ జాన్ సిల్వర్ అనే వాణ్ణి వంటవాడుగాను కుదిర్చారు. సిల్వర్ అసలు సముద్రపు దొంగల్లో వాడే అయినందున, మిగతాకళాసులందరితో కలిసి మమ్మల్ని చంపడానికి పెద్దకుట్ర పన్నాడు. ఇక చదవండి.

## 12. యుద్ధ చర్చలు

నేను ఓడనరంబీమీదికి వెళ్లేసరికి కళాసీలు, నా మిత్రులు అందరూ అక్కడ సమావేశమై వున్నారు. సముద్రాన్ని ఆవరించిన పొగమంచు మెల్లిగా విచ్చిపోతున్నది. చంద్రుడు నిర్మలంగా ప్రకాశిస్తున్నాడు. మాకు నైరృతిమూలగా రెండు చిన్న కొండలు, వాటివెనక ఎత్తైన మరొకకొండ కనిపించాయి.

ఇదంతా కలలోనుంచి చూస్తున్నవాడివలె చూశాను. సిల్వర్ కుట్రను చెవులారా విన్నప్పటి భయం ఇంకా నన్ను వీడలేదు. ఇంతలో కెప్టెన్ స్మాలెట్ కొత్త ఆజ్ఞలు జారీచేశాడు. కళాసీలు హిస్పానియోలాను ద్వీపం తూర్పుదిక్కుకి మళ్లించారు.

కెప్టెన్ అడిగాడు: "మీలో ఎవరన్నా ఈ ద్వీపం ఇదివరకు చూశారా?"

"నేను చూశానండి," అంటూ సిల్వర్ ముందుకు వచ్చాడు. "ఒకసారి నేను పనిచేసిన ఓడ ఈ వైపుగా వచ్చింది."

"రేవు ద్వీపానికి దక్షిణంగా, ఒక చిన్నలంక చాటున ఉండనుకుంటాను", అన్నాడు కెప్టెన్.

"అవునండిసార్. దెయ్యాలదీవి అంటారండి దాన్ని. ఒకప్పుడిక్కడ సముద్రపు దొంగలు మాంచి జోరుగా ఉండేవారుటండి. మా ఓడలో ఒక కళాసీకి ఈద్వీపంసంగతి బాగా తెలుసు. అతనే నాకు చెప్పాడు. చూడండి, ఆతట్టున కనబడుతోందే, కొండ? దాన్ని డమాన్‌దిబ్బ అంటారండి. మనకి దగ్గిర్లో కనిపిస్తున్న దాన్ని చిన్న డమాన్‌దిబ్బ అంటారు. ఆ మధ్య ఉన్నది చూడండి, పెద్దకొండ, దాన్ని టెలిస్కోప్ కొండ, అంటారండి. దానిమీద కెక్కితే టెలిస్కోపులోంచి చూసినట్టు అంతా కనిపిస్తుందిటండి."

"ఇదుగో చూడు, సిల్వర్! నాదగ్గిరొక పటముంది. మనం ఆగవలసిన రేవు ఇదేనేమో చూడు," అన్నాడు కెప్టెన్.

సిల్వర్ గబగబ వచ్చి పటం అందుకున్నాడు. కాని ఒక్కసారి చూడగానే తెల్లమొహం వేశాడు. పటంలో అతనికి కావలసిందిలేదు. ఆపటం మాకు బిల్లీ బోన్స్ పెట్టెలో దొరికిన పటం కాదు. దాని నకలు. ఎర్రగుర్తులు, బిల్లీబోన్స్, ఫ్లింట్‌లపేర్లు తీసేసి జమీందారుగారు కెప్టెన్ ఉపయోగంకోసమని నకలుపటం తయారు చేశారు. సిల్వర్ తెల్లమొహం వేసినా మరు

అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు

క్షణంలో తన భావాలన్నిటినీ కమ్ముకుని మామూలు మనిషయ్యాడు.

"ఇదేనండి సార్. రేవు అని రాసివుందే, ఇక్కడే మనం లంగరు దించాలి. చాలా బావుందండి సార్ ఈ పటం. ఎవరు తయారుచేశారో? సముద్రపు దొంగలు తయారుచేశారేమో అంటే, వాళ్ల మొహాం, వాళ్లకా తెలివితేటలు కూడానా?"

"సరే. నీ పని నువ్వు చూసుకో. మళ్లీ కావలిస్తే పిలుస్తాను," అన్నాడు కెప్టెన్.

సిల్వర్ ధైర్యానికి నాకాశ్చర్యం వేసింది. నిర్భయంగా తనకాద్వీపం తెలుసునని చెప్పాడు. అనుమానిస్తారేమోనని కూడా జంకలేదు. అతడు నన్ను సమీపించడం చూసి భయపడ్డాను. ఆపిల్ పీపాలో కూర్చుని అతని కుట్రను నేను విన్నాననే సంగతి అతనికి తెలిసి వుండదు. అయినప్పటికీ అతని ధైర్యం, కుత్సితం, కళాసీలపైన అతనికిగల పలుకుబడి, చూస్తూండగానే తలలు మార్చెయ్యగల శక్తి చూసి అతనంటే నాకప్పుడు చెప్పలేనంత భయంపుట్టింది.

"ఆహా! ఎంత మంచి ద్వీపమనుకున్నావ్ హాకిన్స్? నీలాగా రెండుకాళ్లూవున్న కుర్రవాడు ఎగరటానికి, గెంతటానికి, ఆడుకోటానికి బలేగా వుంటుంది. చెట్లెక్కచ్చు, రేవులో యీతకొట్టచ్చు, గొర్రెలను వేటాడచ్చు, కొండలమీదికి పాకచ్చు—మజాగా వుంటుందిలే. తస్సదియ్యా, అదంతా తలుచుకుంటే నేనుకూడా చిన్నపిల్లడినైపోతున్నాను. ఈ కొయ్య కాలే లేకపోతేనా, నీతోపాటు నేనూ గంతులేసేవాణ్ణి. నువ్వు వెళ్లేటప్పుడు నన్నుకూడా తీసుకుపో. ఏం?"

నన్ను బుజంమీద తట్టి కిందికి వెళ్లిపోయాడు.

కెప్టెన్ స్మాలెట్, జమీందారుగారు, డాక్టరుగారు సరంబీమీద ఒకమూల పిట్టగోడ లానుకుని మాట్లాడుతున్నారు. సిల్వరుకుట్రను వారికి ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా తెలియజెయ్యాలని నా ఆదుర్దా. కాని బహిరంగంగా చెప్పటం మంచిది కాదు. వాళ్ల దగ్గిరకి ఏ నెపంమీద వెడదామూ అని ఆలోచిస్తుండగా డాక్టరు లివ్‌సేగారే నన్ను దగ్గిరికి పిలిచారు. ఆయన పొగాకుపైప్‌ను కింద ఓడగదిలో మరిచిపోయారుట; పట్టుకురమ్మని చెబుదామనుకున్నారుట. నేను ఆయన్ని సమీపించగానే, మెల్లిగా చెప్పాను: "డాక్టరుగారూ! మీతో అర్జంటుగా మాట్లాడాలి. వాళ్లిద్దర్నీ కూడా కిందగదిలోకి తీసుకు వెళ్లండి. తరవాత ఏదో వంకమీద నన్ను పిలిపించండి. చాలా ఘోరవార్త చెప్పాల్సివుంది," అన్నాను.

డాక్టరుగారు ఒక్కక్షణం కంగారుపడ్డారు. కాని మరుక్షణంలో మామూలైపోయారు.

"ఆ, అంతేనా. సరేలే నువ్వుపో యింక," అన్నారాయన బిగ్గిరగా. మిగతా వారిద్దరినీ కలుసుకుని ఆయన ఏదో మాట్లాడారు. వారిలో ఒక్కరూ ఉలిక్కిపడటంగాని, "ఆ" అని కంగారుపడటంగాని, చేయలేదు. కాని డాక్టరుగారు నేను చెప్పింది వారితో చెప్పారని గ్రహించాను. వెంటనే కెప్టెన్ స్మాలెట్

తండేలు ఆండర్సన్‌ను పిలిచాడు, కళాసీల సందర్శన సమావేశం చెయ్యమని ఆజ్ఞాపించాడు.

తండేలు విజిల్ వెయ్యగానే కళాసీలు సరంబీ మధ్యభాగానికి వచ్చి నిలబడ్డారు. కెప్టెన్ స్మాలెట్ వారితో ఇలా చెప్పాడు:

"జమీందారు త్రెలానీగారు మీతో ఒక్క ముక్క చెప్పమన్నారు. మన ప్రయాణం ముగిసింది. మనం చేరవలసిన ద్వీపం చేరుకున్నాం. 'కళాసీలందరూ బాగా పనిచేశారా' అని త్రెలానీగారు నన్నడిగారు. ఒక్కడుకూడా నా ఆజ్ఞలు నిర్లక్ష్యం చెయ్యలేదని, తమ విధులు సక్రమంగా నెరవేర్చారనీ, ఆయనకు మనవి చేసుకున్నాను. అందుచేత మీ అందరి ఆయురారోగ్యాలకోసం ద్రాక్షరసం సేవించవలసివుందని ఆయనన్నారు. అందుకని మేమిప్పుడు కిందగదిలోకి వెళ్లబోతున్నాము. మీకు ద్రాక్షరసం, మంచి ఖరీదైనది సప్లయి చేయిస్తాను. త్రెలానీగారి ఆయురారోగ్యాలు కోరుతూ మీరు కూడా తాగండి."

సిల్వరు ఈ ఉపన్యాసం వింటూ, విషపునవ్వు నవ్వుతున్నాడు. "జమీందారు త్రెలానీగారికీ—" అని అరిచాడు.

"జై" అని ఓడ దద్దరిల్లేట్టు అరిచారంతా. ఆ అరుపు వింటే ఈమనుషులేనా మమ్మల్ని చంపటానికి చూస్తున్నది అనిపించింది.

"కెప్టెన్ స్మాలెట్‌గారికీ—" అని మళ్లీ అన్నాడు సిల్వరు.

"జై" అని మళ్లీ అరిచారు కళాసీలు.

కెప్టెను, జమీందారుగారు, డాక్టరుగారు ఓడ గదిలోకి వెళ్లిపోయారు. రెండు మూడు నిమిషాల తర్వాత "జిమ్‌హాకిన్స్‌ని ఒకసారి పంపించవలసిందని" కబురువచ్చింది.

ముగ్గురూ బల్లచుట్టూ కూర్చున్నారు. మధ్య స్పానిష్ ద్రాక్షరసం సీసా ఉంది. పక్కన మూడు చిన్న చిన్న గ్లాసుల్లో ద్రాక్షసారా ఉంది. డాక్టరుగారు పైప్ కాలుస్తూ గుప్పు గుప్పుమని వేగంగా పొగవదులుతున్నారు. ఆందోళనగా ఉన్నప్పుడాయన అలాగే పొగ తాగుతారు. నన్ను చూడగానే జమీందారుగారు "హాకిన్స్! ఏదో చెబుతానన్నావుట, ఏమిటది?" అన్నారు.

నేను ఆపిల్‌పీపాలో కూర్చుని విన్నదంతా పూసగుచ్చినట్టు వివరించాను. నా కథ పూర్తయ్యేదాకా శ్రోతలు కుర్చీలకు అంటిపెట్టుకుని కూర్చున్నారు.

నాకథ పూర్తయ్యాకగాని వాళ్లు నన్ను కూర్చోమనలేదు. తరవాత ఒక గ్లాసులో ద్రాక్షరసం పోసి ఇచ్చారు. నా ఆరోగ్యాన్ని కోరుతూ వాళ్లు సారా తాగారు. జమీందారుగారి ముఖంలో మార్పు గమనించాను.

"కెప్టెన్ స్మాలెట్! మీరు నిజం చెప్పారు. నేను గాడిదనయ్యానని ఒప్పుకుంటున్నాను. ఇక మీరెల్లా చెబితే అల్లా నడుస్తాను," అన్నారు జమీందారుగారు ముఖం తప్పిస్తూ.

"నాకంటే పెద్దగాడిద కాలేదులెండి మీరు. మొదట్లోనే తగినజాగ్రత్త పడివుండవలసింది నేను. నా అనుమానం రైటో కాదో మొదటనే తేల్చుకోకపోవటం నాపొరబాటే."

"కాని కెప్టెన్! ఈ సిల్వర్ మహాదేవాంతకుడులాగా వున్నాడు. మనిషిని చూస్తే అంతకంటే మర్యాదస్థుడు లేనట్లుంటాడు. ఎంత కుట్ర పన్నాడు?" అన్నారు డాక్టరుగారు.

"సరే, యీ మాటలకేంగాని అసలు సంగతి మాట్లాడదాం," అన్నాడు కెప్టెన్. "త్రెలానీగారనుమతిస్తే రెండు మూడు విషయాలు చెబుతాను."

"అనుమతి ఇవ్వవలసింది మీరు," అన్నారు త్రెలానీగారు ముఖమెత్తకుండా.

"మొదటిది. మనం వెనక్కి తిరగటానికి వీల్లేదు. ముందుకే పోవాలి. రెండు. మన కింకా వ్యవధి వుంది. అంటే గుప్తధనం తవ్వి ఎత్తేవరకూ వాళ్లు మన కే హానీ తలపెట్టరు. మూడు. ఓడలో మనం నమ్మదగిన మనుషులింకా కొందరున్నారు. ఎప్పుడో ఒకప్పుడు కుట్రదారులకూ మనకూ బహిరంగయుద్ధం తప్పదు. కనుక నే చెప్పేదేమంటే, ఒక మంచిరోజు చూసి, వాళ్లు అనుకోని సమయంలో హఠాత్తుగా మనమే ముందు దాడిచేద్దాం. ముందు దాడిచేసే అవకాశం వాళ్ల కివ్వగూడదు. త్రెలానీగారూ! మీ స్వంత నౌకర్లు ముగ్గురున్నారు. వాళ్లని మనం విశ్వసించవచ్చునా?"

"ఆ. నన్ను నమ్మినంత గట్టిగా నమ్మవచ్చు."

"సరే. వాళ్లు ముగ్గురు. హాకిన్స్‌తో కలిపి మనం నలుగురం. మొత్తం ఏడుగురం. ఇంకెవరున్నారు మన వాళ్లు?"

డాక్టరుగారందుకున్నారు: "ట్రెలానీ సిల్వర్‌ను కలుసుకోక ముందు నలుగురైదుగుర్ని మాట్లాడాడుగా. వాళ్లు బహుశా మంచివాళ్లే కావచ్చును."

"ఉహూ. కాదులే. ఇజ్రాయెల్ హాండ్స్‌ని నేనేగా మాట్లాడింది. వాడుకూడా ఆ ముఠాలో చేరిన వాడేగా. అంచేత వాళ్లలో ఎవర్ని నమ్మటానికి వీల్లేదు."

"నేను చెప్పేది వినండి సార్. మనం తొందర పడకుండా ఎవరు నమ్మకస్థులో ఎవరు కాదో ముందు కనిపెట్టాలి," అన్నాడు కెప్టెన్.

"మనకు జిమ్ ఉన్నాడుగా. అతనిదగ్గిర కళాసీలంతా చనువుగా ఉంటారు. జిమ్‌కూడా తెలివి తేటలైనవాడు. ఒక్కచూపుతో మనిషితత్వం కనిపెట్టగలడు," అని సిఫార్సుచేశారు డాక్టరుగారు.

"హాకిన్స్! నీమీదే ఆశలు పెట్టుకున్నాం," అన్నారు జమీందారుగారు.

మా చర్చలు ముగిశాయి. కాని ఎంత చర్చించినా సమస్య తెగలేదు. మొత్తం ఓడమీదున్నవాళ్లు ఇరవైయారుగురు. అందులో మా శత్రువులు పంధొమ్మిదిమంది. మేము ఏడుగురం. అందులో ఒకడు బాలుడు. కనుక యుద్ధంఅంటూ వస్తే ఇటు ఆరుగురు, అటు పందొమ్మిదిమంది నన్నమాట.

## 13. నేను చేసిన సాహసం

మర్నాటి ఉదయం నరంబీమీదికి వచ్చిచూశాను. కాంచనద్వీపం రాత్రి చూసినట్టు లేదు; చాలా మారిపోయింది. బూడిదరంగుచెట్లు దట్టంగా పెరిగివున్నాయి. మధ్య మధ్య ఎత్తైన దేవదారువృక్షాలు ఉన్నాయి. కొండగుట్టలు చెట్లకంటే ఎత్తుగా ఉండి బోడిగా కనిపించాయి. టెలిస్కోప్ కొండ మిగతావాటికంటె నాలుగైదు వందల అడుగులు ఎత్తుగా వున్నది. కొండల ఆకారాలు తమాషాగా వున్నాయి. మొత్తానికి ద్వీపస్వరూపం చూస్తే ఏమిటో వికారం పుట్టింది.

హిస్పానియోలా దెయ్యాలదీవికీ అసలు ద్వీపానికీ మధ్యఉన్న రేవుకు అభిముఖంగా పోతోంది. ద్వీపానికి చెందిన రకరకాల పక్షులు మా ఓడపైగా ఎగురుతూ రొదచేస్తున్నాయి. కెరటాలు ఉవ్వెత్తుగా లేచి ఓడను ఉయ్యాల లూపుతున్నాయి. అక్కడ సముద్రమంతా మురికిగా, నానా ఛండాలంగా ఉంది. ముక్కులు బద్దలు కొట్టేసేటంత దుర్గంధం వస్తోంది. ఇదంతా చూస్తే నాకు కాంచనద్వీపంమీద ఇంత వరకూ ఉన్న మోజు పోయి రోత పుట్టుకొచ్చింది.

ఇక ఓడమీద పరిస్థితులేమన్నా బాగున్నాయేమో అంటే, అవీ అంత అధ్వాన్నంగానూ ఉన్నాయి. రేవు దగ్గిర కొస్తున్నకొద్దీ కళాసీల్లో తిరుగుబాటుచిహ్నాలు ఎక్కువ కాసాగాయి. జాబ్ ఆండర్సన్ అందరికంటే ఎక్కువగా పొగరుమోతుతనం ప్రదర్శిస్తున్నాడు. నాకు వినిపించేట్టు రెండు మూడుసార్లు "ఇంకెంతసేపు లే మీ పని," అని బూతులతోసహా గొణిగాడు. మిగతావాళ్లు కూడా కెప్టెన్ వంక, నా ఇతరమిత్రులవంక కొరకొర విషపు చూపులు చూస్తున్నారు. ఒక్క సిల్వర్ మాత్రం మా మీాలు మర్యాదధోరణిలోనే ప్రవర్తిస్తున్నాడు. కెప్టెన్ ఏదన్నా ఆజ్ఞాపిస్తే ఇదివరకటికంటే ఎక్కువ వినయంగా నెరవేరుస్తున్నాడు. మిగతా కళాసుల దగ్గిరికి వెళ్లి ఏదో గుసగుస లాడుతున్నాడు. "తొందర పడకండి," అని హెచ్చరిస్తున్నట్లు నాకు తోచింది.

ఓడ ద్వీపపటంలో సూచింపబడిన రేవును చేరింది. ఓడకు ఒకవేపు దెయ్యాలదీవి, మరోవైపు కాంచనద్వీపం అరమైలు దూరాల్లో ఉన్నాయి. లంగర్లు పెద్దశబ్దాలుచేస్తూ నీటిలో మునగగానే ఒడ్డుల నున్న చెట్లమీది పక్షులు గోలగా ఒక్కసారి పైకెగిరి మా ఓడను ముసిరాయి. కుళ్లి కాసేపటికి ఎక్కడివక్కడ సర్దుకున్నాయి.

ఓడ ఆగగానే కళాసీల తిరుగుబాటు లక్షణాలు ఇంకా ఎక్కువయ్యాయి. అందరూ ఒకచోట చేరి గుసగుస లాడటం, మాలో ఎవరమున్నా సమీపిస్తే మాట లాపివెయ్యడం సాగించారు. కెప్టెన్ ఎంత చిన్న పనిచెప్పినా, నిర్లక్ష్యంగా, గొణుగుతూ చెయ్యటం, లేకపోతే అసలు చెయ్యకపోవటం మొదలెట్టారు.

చివరికి మేము మళ్లీ ఓడగదిలో సమావేశమయ్యాము. కెప్టెన్ చెప్పాడు:

"సార్! నే నింకొక్క ఆజ్ఞ ఇచ్చానూ అంటే తిరుగుబాటు తప్పదు. వాళ్ల కేదన్నా పని చెబుదామా అంటే, ప్రమాదం సంభవించేట్లుంది. చెప్పకుండా ఊరుకుంటే, మనం తమ రహస్యం కనిపెట్టినట్లు అనుమానిస్తారు. మన మీ పరిస్థితుల్లో ఒక్కణ్ణే నమ్మటానికి వీలుంది."

"ఎవ రతడు?" అన్నారు త్రెలానీగారు.

"సిల్వరే. తన అనుచరుల ఆవేశాన్ని అణచటానికి శాయశక్తులా తంటాలు పడుతున్నాడు. అతడు సాధ్యమైనంతవరకూ తొందరపడడు. అందర్నీ ఒకచోట జేర్చి నచ్చచెప్పటానికి చూస్తున్నట్లున్నాడు. కనుక వాళ్లకు మనం అవకాశం యివ్వాలి. ఒకపని చేస్తాను. ఈ పగలంతా మీరు ద్వీపంలోకి పోయి విశ్రాంతి తీసుకోవచ్చునని చెప్తాను. ఈ అవకాశం వాళ్లు జారవిడవరు. అందరూ కట్టగట్టుకునిపోతారు. అప్పుడు మనం వాళ్లని మళ్ళీ ఓడమీదికి రాకుండా పోరాడాల్సి వస్తుంది. ఎవరూ పోరనుకోండి. అప్పుడు మనం ఈ ఓడగదిభాగంలోనే నిలిచి యుద్ధం చెయ్యాలి. కొందరు వెళ్లి కొందరిక్కడ దిగబడతా రనుకోండి అప్పుడు మనకేమీ ప్రమాదం రాదని, ఇంకా. టైము వుందని అనుకోవాలి."

ఆవిధంగా ఒక నిశ్చయానికి వచ్చి, ఒక ప్లాను తయారు చేసుకున్నాం. తూటాలు నింపిన పిస్టళ్లు నమ్మకస్థులందరికీ పంచబడినయ్. త్రెలానీగారి ఇంటి నౌకర్లు హంటర్, రెడ్రూత్, జాయిస్‌లకు కుట్రసంగతి చెప్పాము. వాళ్లు మేమనుకున్నంత ఆశ్చర్యపడలేదు. వాళ్లకు కళాసీల ప్రవర్తన మొదటినుంచీ అనుమానాస్పదంగానే వుందిట. "ఒక్కొక్క ముండాకొడుకును నల్లిని నలిపినట్టు నలిపిపారేస్తా"మని హంటర్ అన్నాడు.

తరవాత కెప్టెన్ స్మాలెట్ సరంబీమీదికి వెళ్లాడు. కళాసీలందరినీ పిలిచాడు. "మిత్రులారా! అందరం అలిసిపోయాము. చాలా రోజులు సముద్ర ప్రయాణం చేశాక కాసేపు నేలమీద విహరించాలని సహజంగా మీకు కోరిక వుంటుంది. బోట్లను నీళ్లలో వెయ్యండి. వెళ్లదలుచుకున్న వాళ్లందరూ వెళ్లవచ్చు. సూర్యాస్తమయానికి అరగంట ముందు తుపాకీ పేలుస్తాను. అప్పుడు మీరు వచ్చెయ్యవచ్చు."

ఈమాట వినగానే కళాసీలు సంతోషం



సూర్యాస్తమయానికి అరగంటముందు తుపాకీ పేలుస్తాను. అప్పుడు మీరువచ్చెయ్యవచ్చు.

ఆపుకోలేక గంతులువేశారు. నేలమీదికి పోగానే గుప్తధనం ఇట్టే వెదికి పట్టుకోవచ్చు ననుకున్నారల్లే వుంది. "కెప్టెన్ స్మాలెట్‌కీ జై" అని మళ్లీ కేక వేశారు. ఆ కేక దూరపు కొండల్లో ప్రతిధ్వనించింది; మళ్లీ పక్షులు గోలగా లేచి ముసిరాయి.

కెప్టెన్ తెలివిగా అవతలకు వెళ్లిపోయాడు. సిల్వర్ తనపార్టీలో ఎవ రెవరు రావాలో, ఎవరు ఓడమీదే ఉండాలో ఏర్పాటుచేశాడు. ఆరుగురు ఓడలోనే ఆగిపోయారు. సిల్వరుతో కలిపి మిగతా పదముగ్గురూ బోట్లలో బయల్దేరారు.

అప్పుడు నాబుర్రలోకి ఒక ఆలోచన ప్రవే

శించింది. అది వట్టి తెలివితక్కువ ఆలోచనే కావచ్చును. కాని నేనల్లా చెయ్యకనేపోతే మా ప్రాణాలు నిష్కారణంగా కాంచన ద్వీపానికి బలిఅయి వుండేవి.

ఓడమీద వుండి ప్రస్తుతం నేను చెయ్యగలిగిందేమీ లేదు. అందుచేత తీరానికి పోయి ఏవో సాహస కృత్యాలు చెయ్యాలని, గుప్తధనం ఉన్నచోటు నామిత్రులకంటే ముందే కనిపెట్టి వాళ్లను ఆశ్చర్యపరచాలని ఒక ఊహ తట్టింది. ఇక వెనకా ముందూ ఆలోచించకుండా అయిదారుగురు కళాసీలున్న ఒక బోటులోకి దూకేశాను. వెంటనే బోటు ప్రయాణం మొదలెట్టింది. ఇంకా రెండు మూడు బోట్లలో కళాసీలున్నారు. వారిబోట్లకంటే తేలికైనది కావడంవల్ల నేనున్నబోటు, చురుకుగా, త్వరగా పోతోంది. నేను బోటులో వున్నట్లు ఎవరూ కనిపించలేదు. చుక్కాని పట్టుకున్న కళాసీ ఒకడుమాత్రం "జిమ్! నువ్వేనా అక్కడుంది? కదలకుండా కూర్చో" అన్నాడు. దూరాన బోటులో ఉన్న సిల్వరు కళ్లు చిట్లించుకుని నాకేసి చూస్తూ నేను అవునో కాదో అని పరిశీలిస్తున్నాడు. మాబోటు ఒడ్డు తగిలీ తగలగానే దగ్గిరగా ఉన్న ఒకకొమ్మనందుకుని ఒక్కవూపుతో ఒడ్డుమీద పడ్డాను. సిల్వర్‌బోటు ఇంకా వందగజాల దూరంలో వుంది.

"జిమ్! జిమ్! ఆగు," అని సిల్వరు గద్దిస్తూ కేకలు వేస్తున్నాడు. నేను వినిపించుకోకుండా ముక్కుకు సూటిగా పరుగు పుచ్చుకున్నాను. కాలిలో సత్తువ వున్నంతవరకూ పరిగెత్తాను. ఇక పరిగెత్తలేక ఆగి నలుదిక్కులా పరికించాను.

(ఇంకా వుంది.)

# నెహ్రూ మామయ్య



రెండేళ్ల కిందటి సంగతి. భారత దేశపు ప్రధాన మంత్రి జవహర్లాల్ నెహ్రూ అమెరికా వెళ్లి, ఆ దేశ ప్రజలిచ్చిన గొప్ప సన్మానాలు స్వీకరించి మన దేశం తిరిగి వచ్చారు. బొంబాయి విమానాశ్రయంలో విమానం దిగగానే ఆయనకు కొందరు బాలకులు స్వాగతమిచ్చారు. ఆ బాలకులు "బాల్కన్-జి-బారీ" అనే బాల సంఘంలో సభ్యులు. తమ సంఘానికి రావలసిందని, వచ్చి కులాసాగా "కొంత సేపు గడపవలసిందని ఆహ్వానించారు. అసలు నెహ్రూకు పిల్లలతో ఆడుకోవడమంటే బలే సర్దా. కాని దూర ప్రయాణంలో బాగా అలిసిపోయి వున్నందున, ఢిల్లీలో వల్ల అర్జెంటు పనులుండటం చేత ఆయన వారి అహ్వానానికి ఒప్పుకోలేదు. "మీరు మా సంఘానికి రాకపోతే మేమే ఢిల్లీ వస్తాం" అని బాలురు అన్నారు.

"జరూర్ ఆయియే, జరూర్ ఆయియే," అని (తప్పకుండా రండి, తప్పకుండా రండి) నెహ్రూ సమాధానమిచ్చారు.

నెహ్రూ ఆహ్వానం ప్రకారం మొన్న బుధవారంనాడు (అక్టోబరు 24) 130 మంది బాలకులు బొంబాయి నుండి ఢిల్లీ వెళ్లారు. సాయంత్రం వారందరికీ నెహ్రూగారు తన తోటలో గొప్ప స్వాగతమిచ్చారు. ఆ సందర్భంలో మంచి విందు ఏర్పాటు చేశారు. ఆవిందులో పిల్లలు చక్కగా వరసలుతీర్చి, అల్లరి గిల్లరి చెయ్యకుండా కూర్చుని లడ్డూ జిలేబీలు, ఐసుక్రీములు తిన్నారు. నెహ్రూ వారిమధ్యకు రాగానే "నెహ్రూ మామయ్యా జిందాబాద్" అని జయధ్వనులు చేశారు. బాల సంఘనాయకుడు నెహ్రూ మామయ్యని ఉపన్యాసం ఇవ్వమని కోరాడు. "బలేవాడివే. పిల్లలతో ఉన్నప్పుడు కూడా ఉపన్యాసాలేనా? అసలే నాకు ఉపన్యాసాలివ్వడం తప్ప ఏం చేతకాదని ఒక అపవాదు ఉంది. పిల్లలతో ఉన్నప్పుడు సర్దాగా ఆడుకోవాలి. అంతే," అన్నారు నెహ్రూ.

తరువాత ఆయన ప్రతిఅబ్బాయి దగ్గిరికి వెళ్లి యోగక్షేమాలు కనుక్కున్నారు. ఒకబుల్లి అబ్బాయిని ముద్దు పెట్టుకున్నారు, ఒకళ్లని తమాషా ప్రశ్న లడిగారు; ఇంకొకళ్లని ఛలోక్తులతో నవ్వించారు.

"రెండు మూడేళ్ల కిందట మమ్మల్ని బొంబాయి విమానాశ్రయంలో చూశారు; జ్ఞాపకం ఉందాండి మామయ్యగారూ?" అని కొందరడిగారు. "ఆ, జ్ఞాపకం లేకేం," అన్నారాయన.

"ఢిల్లీలో మీరేమేమి చూశారు?" అని నెహ్రూ అడిగారు.

"లాల్ ఖిల్లా చూశాం. జుమ్మా మసీదు చూశాం. మరి రాజేంద్రప్రసాద్ గారి భవనం చూశాం. కుతుబ్ మినార్, జంతర్ మంతర్, అన్నీ చూశాం," అన్నారు పిల్లలు.

"మీరు చూసిన అన్నిటిలోకీ

(40-వ పేజీ చూడండి)



రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ గారూ, బాలసంఘసభ్యులూ కలుసుకున్న దృశ్యం.

# మతిమరుపు

శ్రీ డాకుపాటి బాబూరావ్

పూర్వం గంగారామ్ అని ఒకతను వుండేవాడు. అతనికి నల్ల మందు వేసుకోవడం అలవాటు! అతను కష్టపడి సంపాదించిందల్లా నల్లమందు తినడంలోనే సరిపోయేది! బాలలూ! నల్లమందు వేసుకునేవారిని ఎప్పుడైనా చూసారా! వాళ్ల తెలివితేటలు ఎలా వుంటాయో తెలుసా! ఒక చోట పెట్టినవస్తువును యింకొక చోట వెదుకుతారు! ఎప్పుడూ నిరసంగా వుంటారు! వుత్సాహమనేది వెదకి చూసినా కనబడదు! ఖచ్చితంగా చెప్పాలంటే వాళ్లకు మతిమఱుపు ఎక్కువ! అలాగే యీ గంగారామ్‌గారున్నూ!

ఒకసారి ఏం చేశాడో తెలుసా! పగలల్లా కష్టపడి పనిచేసి సాయంత్రానికల్లా రెండు రూపాయలు చేత్తో పుచ్చుకొని యింటికి చేరుకున్నాడు. ఒకరూపాయి పెళ్లాం చేతులో పడేసి తిన్నగా నిక్కుతూ, నీలుగుతూ బజారు చేరుకున్నాడు! స్నేహితుల్తో మాట్లాడుతూ, ఆపనీ యీపనీ చూసుకొని నల్లమందు కొట్టువద్దకు వెళ్లేటప్పటికి, కాస్తా కొట్టుకట్టేసి, కొట్టుగల ఆసామి యింటికి పోయాడు. హా రే. రామ్! యివాళ నల్లమందు లేకుండా పోయిందే అనుకున్నాడు! నల్లమందు లేకపోయేటప్పటికి నాలికరుచి మిఠాయిమీదకు పోయింది. సరే మిఠాయన్నా కొనుక్కు వెళ్దామని, మిఠాయి కొట్లవద్దకు వెళ్లాడు. అవీగూడా పాపం మూసేశారు. మూల ఒక కొట్టు యింకా మూసేయలేదు. గంగారామ్ గబగబా అక్కడకు చేరుకున్నాడు. "ఇదిగో ఓ అర్ధ రూపాయి మిఠాయి కట్టు!" అన్నాడు గంగారామ్.

"కొట్టు మూసేస్తూ వుంటే యిప్పుడేం మిఠాయి? రేపురా" అన్నాడు కొట్టుగల ఆసామి.

గంగారామ్‌కు చచ్చేనంత పనయింది. "రేపు నువ్వమ్ముతావని నాకూ తెలుసు! కావలసిందల్లా యివ్వాళే రేపు నాకు దేనికి! త్వరగా యివ్వు. పోవాలి." అన్నాడు మళ్లా గంగారామ్.

"అబ్బే! చెప్తాతుంటే నీకు కాదూ. పోనీ యిద్దామన్నా నా వద్ద రూపాయి చిల్లర లేదు. అంతా మాయజమాని పట్టుకుపోయాడు" అన్నాడు కొట్టువాడు.

గంగారామ్‌కు కాస్త ఆశ కలిగింది "చిల్లర లేకపోతే పోనిలెద్దూ! మిగిలిన అర్ధరూపాయి ప్రొద్దున యిద్దువుగానిలే! యిప్పుడు మిఠాయి తప్పకుండా కావాలి." అంటూ రూపాయి త్రాసులో పడేశాడు. ఇక కొట్టువాడు ఏమీ అనలేక పోయాడు. నసనసంటూ. అర్ధరూపాయి మిఠాయి తూచియిచ్చేశాడు. గంగారామ్ మిఠాయి తీసుకొని పదడుగులు ముందుకు నడిచాక మళ్లా అనుమానం కలిగింది "ఒకవేళ రేపు కొట్టు మరిచిపోతానేమో!" అనుకుంటూ యిటూ అటూ చూశాడు. చూసేసరికి తను మిఠాయి తీసుకున్న కొట్టువద్ద ఒక ఆంబోతు పండుకొని నెమరువేస్తూ వుంది! ఆంబోతును చూసి, దాని రంగూ, ఎంత లావుందీ, ఎన్ని మచ్చలున్నాయి, మొదలైన గుర్తులు చూసుకొని సంతోషంగా యింటికి పోయాడు. ఆ వేళ అలా గడిచిపోయింది.

మర్నాడు గంగారామ్ లేచేటప్పటికి సరిగ్గా తొమ్మిదయింది. బడలిక అంతా తీరిం తరువాత రాత్రి అర్ధరూపాయి వసూలు చేయాలని జ్ఞాపకం వచ్చింది. వెంటనే బజారు బయలుదేరాడు. తీరా బజారెళ్లి చూసేటప్పటికి ఆంబోతు కనిపించలేదు! గంగారామ్‌కు ఆంబోతు కనుపించకపోయేసరికి గాభరాపుట్టింది. యిక ఆంబోతు కోసం బజారంతా గాలించేస్తూ వున్నాడు. చివరకు ఒక దర్జీకొట్టువద్ద పడుకున్న ఆంబోతు కనుపించింది! రాత్రి గంగారామ్ గుర్తుపెట్టుకొన్న ఆంబోతే అది. అది ఒకచోటే అలా వుంటుందా. తిరిగి తిరిగి వచ్చి దర్జీకొట్టువద్ద పడుకుంది. గంగారామ్ సంతోషిస్తూ దర్జీకొట్టువద్దకు

వెళ్లి మెల్లగా "ఏమండీ! రాత్రి ఎనిమిదణాలు యిస్తారా!" అన్నాడు. బట్టలు కుట్టేవాడికి ఏమీ తెలియక "రాత్రి ఎనిమిదణాలు ఏమిటండీ! ఎవరు మీరు?" అన్నాడు.

"అదేమి టయ్యోయ్! అలా అంటావ్! రాత్రి మిఠాయి తీసుకొని రూపాయి, యివ్వలేదా నీకు! అర్ధరూపాయి ప్రొద్దున్న యిస్తానన్నావు" అన్నాడు గంగారామ్ ఆశ్చర్యంగా!

"చాల్చాల్లే! యిది బట్టలకొట్టు! మిఠాయికొట్లు యిక్కడ లేవు! వెళ్లు!" అన్నాడు కోపంగా దర్జీవాడు.

గంగారామ్‌కు చాలా ఆశ్చర్యం వేసింది! "యిదిగో! భలే వాడివేనే! అర్ధరూపాయకోసం నీ వేషమంతా మార్చేశావే! సరే వేషమైతే మార్చేయొచ్చునుగాని, రాత్రికి రాత్రే నీకు అంత పెద్ద గెడ్డం ఎక్కడ్నించి వచ్చిందంట!" అన్నాడు అతని గెడ్డంవంక ఆశ్చర్యంగా చూస్తూ! "ఏహూరు మీది! గెడ్డం, గిడ్డం పేరెత్తుతున్నావే! జాగ్రత పళ్లు రాలగలవ్!" అని కొట్టువాడు అనేసరికి గంగారామ్‌కు దర్జీవాడు తంతాడేమోనని భయమేసింది. రాత్రి అర్ధరూపాయి వదిలెయ్యడం నాదే తప్పు! అంతా ఘోరకలికాలంలా వుంద! పోనీలే వుంచుకో! నేను అర్ధరూపాయి వదిలేశాను!" అన్నాడు పెద్ద ధర్మదాతలా! తల గోక్కుంటూ యింటి దారి పట్టాడు!

దర్జీవాడికి ఏమీ అర్థంగాక అలా చూస్తూ వుండిపోయాడు!



# బ్రిటిషు ఎన్నికలు

(4-వ పేజీ తరువాయి)

మారకం, వ్యాపారాలలో బ్రిటన్ భారత దేశాల మధ్య సంఘర్షణ కూడా లేకపో లేదు. విదేశాంగ విధానంలో కొన్ని కొన్ని అంశాలలో పరస్పర విరుద్ధ విధానాల నవలంబించటం కూడా జరిగింది. అట్లీ ప్రభుత్వం లోలోపల ఏవిధంగా తంత్రాలు పన్నినప్పటికీ, పైకి మాత్రం స్పష్టంగా భారత ప్రభుత్వానికి స్వతంత్ర విధానాల ననుసరించే హక్కున్నదని గుర్తించింది. భారతీయులపట్లనూ, కాంగ్రెస్ పట్లనూ ఎన్నడూ స్నేహభావం చూపక భారతస్వాతంత్ర్య ప్రతిపత్తిని నిరోధించిన చర్చిల్ వైఖరి ఇక ముందు భారత ప్రభుత్వం పట్ల ఎలా ఉంటుందో చెప్పనవసరం లేదు. భారతదేశం ఆర్థికంగా బ్రిటన్ పైన ఎంతవరకూ ఆధారపడి ఉంటుందో, అంతవరకూ చర్చిల్ ప్రభుత్వం తమ స్థైర్యంగు ప్రాబల్యాన్ని భారత ప్రభుత్వంపై ప్రయోగించి వైరం సాధించవచ్చుననే అనుమానం భారతీయులకు కలగడం, సహజం.

పూర్వం భారత దేశంలో ముస్లిం లీగ్ ను జస్టిస్ పార్టీని బలపరిచి కాంగ్రెస్ ఉద్యమాన్ని బలహీన పరచడానికి బ్రిటిష్ కన్సర్వేటివ్ లు యత్నించడం భారతీయులకు మరపురాదు. తరువాత అట్లీ ప్రభుత్వమే కాక రహస్యంగా కన్సర్వేటివ్ నాయకులు కన్సర్వేటివ్ పార్టీ పక్షపాతులైన బ్రిటిష్ సైనికాధికారులు పాకిస్తాన్ కు తోడ్పడి భారతదేశానికి చేసిన అపకారాన్ని మరిచిపోవడం కష్టం. ఇక ముందు కాశ్మీర్ సమస్య మొదలైన ఇండో-పాకిస్తాన్ వివాదగ్రస్త సమస్యలలో చర్చిల్ ప్రభుత్వం పాకిస్తాన్ పక్షాన కృషి చెయ్యగలదనే భావించవచ్చును. దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యలో కూడా బ్రిటిష్ ప్రభుత్వం భారతీయులకు విరుద్ధంగా కృషి చెయ్యవచ్చును. పరిస్థితులు విషమిస్తే భారత రిపబ్లిక్ కామన్వెల్త్ సభ్యత్వానికి స్వస్తి చెప్పవలసి రావచ్చు కూడా.







దేవకీబోసు తీస్తున్న "రత్నదీపంలో" మంజూదే.

న్నాడు గనక ఎక్కువ పరిశ్రమిస్తున్నాడని గాని, ప్రజలకు ఎక్కువగా ఉపయోగపడుతున్నాడని గాని అనుకోటం పొరపాటు.

చిత్రనిర్మాణంలో కూడా ఇటువంటి వ్యత్యాసం ఉంది. సినిమాచిత్రాలు స్టూడియోలలో నే తప్ప తయారుకావు. ఈనాడు మంచి సినిమాస్టూడియో అంటే ఎన్నో హంగులుకలదై ఉండాలి. ఉత్తమ తరగతి కామెరాలూ, సౌండు రికార్డింగు ఎక్విప్మెంటూ, లాబొరేటరీ, కార్ఖానాలూ, కార్పెంటరీయార్డూ, మౌల్డింగ్ డిపార్ట్మెంటూ, లైట్లూ, ప్రదీపములూ, ప్రొజెక్షన్ రూములూ, ప్లేబాక్, మిక్సింగ్, రీరికార్డింగ్ పరికరాలూ, బాక్ ప్రొజెక్షనూ, ఆప్టికల్ ప్రింటరూ — ఏమేమిటో ఉండాలి. ఇదంతా చేరి భారీపరిశ్రమకిందికి వస్తుంది. ఇన్ని హంగులతోనూ స్టూడియో కట్టవలసొస్తే అది చిత్రనిర్మాతలకు అద్దె వ్యాపారానికి పనికొస్తుంది తప్ప చిత్రనిర్మాణ పారిశ్రామికుల స్వంత అవసరాలకు చాలా ఎక్కువవుతుంది. చెప్పవచ్చిందేమంటే ఏటకు ఒక చిత్రం మాత్రమే తియ్యటానికి తగిన ఆధునిక స్టూడియో అంటూ లేదు. స్టూడియో వ్యాపారం అభివృద్ధి అయి చిత్రనిర్మాణ పరిశ్రమను మింగే దశ వచ్చేసింది. కాలంలో కలిగిన పరిణామాన్ని గుర్తించని అమాయకులు "కిరాయి" స్టూడియోలతో విసిగి, చిత్రనిర్మాణంలో తమకు లభించిన కొద్ది లాభాలకు మరికొంత అప్పు జతచేసి, ఒక చిన్న ఫ్లోర్ వేసి, ఒక పాత రికార్డింగ్ సెట్టూ, కామెరా సంపాదించి, ఒకరిద్దరు వడ్రంగులనూ, పెయింటర్లనూ, కొద్ది లైట్లనూ, లైట్ బాయిస్‌నూ చేర్చి స్టూడియో ఏర్పాటు చేసుకుని, రషెస్ ఒకచోట ప్రింటు చేయించుకుని, ప్రొజెక్షన్ మరోచోట వేసుకుని, ఒక చిన్న ఎడిటింగ్ టేబిల్ ఏర్పాటు చేసుకొని — ఇంత శ్రమపడటంవల్ల వారి స్వాతంత్ర్యం హెచ్చినా హెచ్చదు, ఖర్చు తడిసి మోపెడవుతుంది. చేతికి వచ్చిన లాభం పోగా, చేసిన అప్పు మిగులుతుంది. వీరి "కలలను" అర్థంచేసుకోవచ్చు, వాటితో సానుభూతి కూడా ఉంచవచ్చు; కాని అది అపాయకరమన్నమాట మాత్రం దాచి లాభంలేదు!

ఇది సమర్థించదగిన పరిస్థితి కాకపోవచ్చు. సామాన్యుడి సానుభూతి, రెండు కేసుల వైపూ, క్రెడిలూ పెట్టుకొని అదర్శాలకోసం పత్రిక నడిపేవాడివైపే ఉంటుంది. కాని ఆ పత్రిక సర్వాంగసుందరంగా లేక ప్రజాదరణ పొందలేక నష్టపడుతుంటే సామాన్యుడి సానుభూతి ఎందుకూ పనికిరాదు. దినపత్రికలు నడిపేవారిలోకూడా కేవల పత్రికాపారిశ్రామికులు గుత్తవ్యాపారస్థులతో పోటీ చెయ్యలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. పారిశ్రామికుడై ఉండి గుత్తపద్ధతులు అవలంబించేవారు హెన్రీఫోర్డులాగా ఎక్కడో ఒకరుంటారు. ఫోర్డు తనకార్లకోసం లోహ పరిశ్రమలూ, కొయ్యకోసం సొంత అడవులూ, సొంత కాగితపరిశ్రమా కూడా ఏర్పాటుచేశాడని ప్రతీతి. అయినా ఫోర్డ్ సంస్థను వాల్‌స్ట్రీట్ గుత్తదార్లు — పారిశ్రామికులనే మారుపేరు పెట్టుకున్న ధనికవర్గం వారు — ఒక ఊపు ఊపారు. ఫోర్డ్ వారసులు ఈ పోటీకి తట్టుకోలేక కొత్తమార్గాలు తొక్కవలసివచ్చింది.

కేవలం చిత్రనిర్మాతలై ఉండి స్టూడియోలు కట్టటానికి ఉద్యమించేవారు అందులోని కష్టనష్టాలు తెలియనివారనుకోవటానికికూడా వీలేదు. ఇందులో కొందరు కేవలం "స్వేచ్ఛాకాంతుల" కోసమే స్టూడియో నిర్మాణానికి ఉద్యమించి ఉండవచ్చు. మరికొందరు పారిశ్రామికులు తమ పారిశ్రామిక తత్వానికీ, స్టూడియోదార్ల వ్యాపార తత్వానికీ పడక సొంత స్టూడి



నవయుగవారి "జ్యోతిలో" నాయకుడు మధు (శ్రీ రామమూర్తి)

యోగాలు ప్రారంభించి ఉండవచ్చు. కొందరు కేవలం ఖర్చు తగ్గించటానికే ప్రారంభించి ఉండవచ్చు. చిత్రనిర్మాతలు స్టూడియో నిర్మాణానికి పూనుకోవటంలో ఏ ఆశయం ఉన్నప్పటికీ కాలక్రమాన వారి ఆశయం ఫలించదని చెప్పాలి.

ప్రస్తుతం మనకున్న చిత్రనిర్మాణంతో పోలిస్తే తగినన్ని స్టూడియోలు లేవు నిజమే. కాని అతుకులబొంత స్టూడియోలవల్ల ఈ లోటు తీరదు. సరి అయిన హంగు లేకుండా చిత్రాలు తీయటంవల్ల చిత్రాల నాణ్యం పడిపోతుంది. లాభం గూబల్లో తీస్తుంది. కొత్తగా వచ్చిన స్టూడియో లేవైతే ఉన్నాయో, అవి మంచివిగానే ఉండాలి. ఇప్పుడున్న వాటితో పోటీ చెయ్యగలవిగా కూడా ఉండాలి. కాని ఈనాడు పెద్ద స్టూడియోల నిర్మాణం మామూలు చిత్ర నిర్మాతలవల్ల అయేదికాదు గనక, దానిని పెద్ద పెట్టుబడిదారీ వ్యాపారస్థులకే వదలాలి. అటువంటి స్టూడియోలు స్వలాభాపేక్షతో చిత్రనిర్మాతలకు చిక్కులూ, నష్టమూ కలిగించకుండా చూసుకోవాలంటే చిత్రనిర్మాతలంతా కలిసి కట్టుగా కట్టుదిట్టాలు చేసుకోవచ్చు. లేదా చిత్ర నిర్మాతలు తలా ఒక స్టూడియో కట్టుకునే బదులు, వాటాలు వేసి సమష్టిగా స్టూడియో నిర్మించుకోవచ్చు. అయితే ఈ విధంగా సమష్టియాజమాన్యం కింద లోగడ నడిచిన స్టూడియోలు కాలక్రమాన గుత్తదార్ల వశమయాయి. కారణం చిత్రనిర్మాతలకు వ్యాపారదృష్టి, తగిన ఐకమత్యమూ లేకపోయాయి. అసలు రహస్యం కూడా, పారిశ్రామికులకు పోటీ చాతనవును, గుత్తవ్యాపారస్థులకు ఐకమత్యం చాతనవును.

* * * *

చిత్రనిర్మాణం కూడా వ్యాపారమే— పరిశ్రమ అయినప్పటికీ. అయితే ప్రస్తుతం చిత్రనిర్మాణంలోకి వచ్చే అధిక సంఖ్యాకులకు చిత్రపరిశ్రమను గురించిగాని, వ్యాపారాన్ని గురించిగాని తెలియకపోవటం ఒక క్లిష్టసమస్య. దేశంలో గల అదనపు ద్రవ్యం సినిమా పరిశ్రమలోకి రావటంచేత తెలుగులో ఈనాడు దాదాపు 50 చిత్రాలు నిర్మాణం కావటానికి సన్నాహాలు సాగుతున్నాయి. చిత్రనిర్మాణానికి ఎగబడుతున్న డబ్బు సినిమా పరిశ్రమమీది లాభాలుమటుకు కాదు. ఈ 50 చిత్రాలలో కొన్ని ప్రజల మొహం చూడవనీ, ప్రజల మొహం చూసేనాటిలో అధికభాగం దెబ్బతింటాయనీ సులభంగా అంచనా వెయ్యవచ్చు. మరొక దేశంలో అయితే ఈ అదనపు డబ్బు స్థావరమైన పరిశ్రమలను సాగించటానికి ఉపయోగించబడును. కాని తెలుగువాళ్ళకు ఏ పరిశ్రమతోనూ పరిచయం లేదు. డబ్బుగలవారు పారిశ్రామికులు కారు. ఎట్టి అనుభవమూ, దక్షతా లేకుండా సాగించదగిన పరిశ్రమ సినిమా చిత్రనిర్మాణమన్న భ్రమ ఒకటి ప్రబలిఉన్నది. ఈ కారణం చేత దేశంలోని అదనపు సొమ్ము ఈ విధంగా గంగపాలు కావటం జరుగుతున్నది. ఇది ప్రతి ఏడూ జరిగే పనికాదు. 1952, 53 లలో ఈ డబ్బు పూర్తిగా హరించిపోతుంది. ఆతరవాత నికరమైన చిత్రనిర్మాణ పారిశ్రామికులు రంగంలో నిలబడతారు. కాని అప్పటికి అదనపు సొమ్ము ఉండదు. కనక వారు డబ్బుకు చాలా ఇబ్బందులు పడతారు. సినిమా తారలకూ, తదితర సినిమా నిపుణులకూ ఒక్కసారిగా గిరాకీ తగ్గిపోతుంది. ఒక చిన్న కాటకం ఏర్పడుతుంది.

తమిళ సినిమారంగంలో ఇది ముందుగానే జరిగిపోయింది. తమిళదేశంలోని అదనపు సొమ్ము కొంత ఇతర పరిశ్రమలకు పోగా మిగిలినది మాత్రమే సినిమా పరిశ్రమలోకి వచ్చింది. అది కాస్తా కర్పూరంలాగ హరించిపోయేసరికి తమిళ సినిమా చిత్రనిర్మాణం ఒక్కసారిగా ఇల కరుచుకపోయింది. 1950 లో 16 తెలుగు చిత్రాలు విడుదల అయితే 10 తమిళ చిత్రాలే విడుదల అయినాయి. అయితే తమిళ రంగంలో గుత్త ప్రాడ్యూసర్లు మరింత బలపడ్డారు. అనేక తమిళచిత్రాలు హిందీలో కూడా తయారై యావద్భారత మార్కెట్టుకు ఎగబాకాయి. ఈ యేడు కూడా తమిళంలో చాలా తక్కువ చిత్రాలే వెలువడతాయి. కాని వెలువడ్డచిత్రాలు చాలావరకు లాభాలు తీస్తాయి. నాటిమీది పెట్టుబడి సినిమా రంగానికి వడ్డీతో సహా తిరిగి వస్తుంది. ఈ యేడు ఇప్పటికే మనచిత్రాలు చాలా దెబ్బతిని ఉండటాన ఈ ఆశ లేదు.

దీనినిబట్టి తేలేదేమంటే ప్రస్తుతం చిత్ర నిర్మాణానికిగాను పెట్టుబడి అవుతున్న తెలుగువారి అదనపు ధనం ఏ స్టూడియో నిర్మాణానికో, థియేటర్ల నిర్మాణానికో వ్యయం అయినట్టయితే తెలుగు సినిమా పరిశ్రమకు మరింత మంచి ఆధారం ఏర్పడుతుంది. పెట్టిన డబ్బు అదృశ్యమైపోదు. వ్యాపారదృష్టిలో అది సరి అయిన పెట్టుబడి. ఒకవేళ అదనపుసొమ్ము అయిపోయిన నాటికి స్టూడియోలు అవసరమైన దానికన్న ఒకటి, రెండు ఎక్కువగా తయారై ఉన్నప్పటికీ అందువల్ల అంతబాధ లేదు. చిత్రనిర్మాణం పడిపోయే పరిస్థితే వస్తే దానికయే ఖర్చుకూడా దిగిరాక తప్పదు. స్టూడియోలు తగినన్ని ఉన్న పక్షంలో వాటి మధ్య పోటీ ఉండి చిత్రనిర్మాతలకు సరి అయిన సౌకర్యాలు సాధ్యమైనంత చవుకగా లభిస్తాయి. స్టూడియోలవారికి కూడా ఏదో లెక్కన ప్రతిఫలం ముట్టుతూ ఉంటుంది. అదీకాక స్టూడియోదారులు ఆనాడే చిత్ర నిర్మాణానికి మరింత ధైర్యంగా పూనుకోవచ్చును. ఇతరత్రా అదనపుసొమ్ము చేజిక్కించుకుని అనుభవంగాని, అనుభవజ్ఞుల సహాయంగాని లేకుండా చిత్రనిర్మాణానికి ముందుకు వచ్చేవారు గమనించదగిన విషయం.

## ★ సినిమావార్తలు ★

### 1950 ఫిలిం బాలట్

మద్రాసు ఫిలింఫాన్స్ అసోసియేషన్ వారు నవంబరు 4 న 1950 ఫిలిం బాలట్ జరుపుతున్నారు. 1950 లో సెన్సారయిన తెలుగు తమిళ చిత్రాలకూ, వాటిలో ప్రధాన పాత్రలు ధరించిన స్త్రీ పురుష తారలకూ బాలట్ జరుగుతుంది. ఈ బాలట్ నడపటానికి మదురలో 10 థియేటర్లూ, బెజవాడలో 10 థియేటర్లూ, రాజపాళెంలో 2 థియేటర్లూ, మద్రాసులో 32 థియేటర్లూ ప్రత్యేకించబడ్డాయి. నవంబరు 4 న ఈ థియేటర్లకు టిక్కెట్లు కొనుక్కొని వెళ్ళేవారు మాత్రమే బాలట్‌లో పాల్గొంటారు. చిత్రాల జాబితా, నటుల జాబితా గల కాగితాలు ప్రేక్షకులకు గేటువద్ద ఇవ్వబడతాయి. ప్రతి ప్రేక్షకుడు ఒక చిత్రానికి, ఒక ఆడతారకు, ఒక మగతారకు మాత్రమే తమ వోటు ఇవ్వాలి. తెలుగు చిత్రాలకూ, తమిళ చిత్రాలకూ వేరువేరు బాలట్ ఉంటుంది.

### తెలుగు చిత్రాల జాబితా

1950 లో సెన్సారయిన తెలుగు చిత్రాలు 16 :

1. అపూర్వ సహోదరులు
2. అదృష్టదీపుడు
3. బీదలపాట్లు
4. మొదటిరాత్రి
5. జీవితం
6. లక్ష్మమ్మ
7. మాయారంభ
8 పల్లెటూరిపిల్ల
9 పరమానందయ్యశిష్యులు
10. సంసారం

(48-వ పేజీ చూడుడు)

## నెహ్రూ మామయ్య

(32-వ పేజీ తరువాయి)

గొప్పగాడున్న దేమిటి?" అని నెహ్రూ ప్రశ్నించారు.

అంతా ఒక్కసారిగా జవహర్లాల్ నెహ్రూ" అన్నారు.

పిల్లలు నెహ్రూ మామయ్య కూతురు ఇందిరా గాంధీ సంతకం కోసం ఎగబడ్డారు. అందరి పుస్తకాలమీద సంతకాలు చేసేసరికి ఆవిడ చెయ్యి నెప్పిపెట్టింది. ఇది చూసి నెహ్రూ తెలివిగా తప్పుకున్నారు. ఆయన కార్యదర్శిఒకడు "మీ పుస్తకాలు ఇక్కడ వదలి వెళ్లండి. ఆయనచేత సంతకాలు చేయించి పోస్టులో మీకు పంపించే పూచీనాది" అని హామీఇచ్చాడు.

బాల యాత్రికులు భారత అధ్యక్షుడు డాక్టరు రాజేంద్ర ప్రసాద్ గార్ని కూడా కలుసుకున్నారు. ★

---

## విలపించే సత్యం

(17-వ పేజీ తరువాయి)

యందు వుండే సానుభూతి కొంత నశిస్తోంది. అతన్ని చూస్తున్నకొద్దీ తనలో అసహ్యం, యీర్ష్య యినుమడిస్తున్నయి. ఒక్కసారీ అతను 'అయ్యో' అనుకుని బాధపడడేమిటి? ఆచిరునవ్వేమిటి ఎప్పుడూ పెదాలపైన ఆ బంధుత్వప్రత్యయమేమిటి. చక్కటి సినిమాలలో వుద్యోగం తన్నిపారేసి తిరిగివచ్చిన యీ గుమాస్తాకు.?

నెల మొదటినుంచీ ఎంతో జాగ్రత్తగా వుంటాడు తను. బంధువులకి వుత్తరాలు రాయడు తనసలు. కన్పిస్తే, వంటనే కష్టాలన్నీ గుమ్మరిస్తాడు వాళ్ళ చెవుల్లో. సినిమాలకు వెళ్ళడు డబ్బు చాలదని. ఉత్తమ గ్రంధాలు చదవలేడు, కొనుక్కోవాలసివస్తుందని. అయినా తన భార్యకు కట్టుకోడానికి చిరుసపట్టని చీరలేదు. తనకి తొడుక్కోడానికి ఒక్క మంచి చొక్కా లేదు. అప్పు ఎక్కడ దొరుకుతుందా అని ఆలోచించని నెలలు లేవు.

ఆలోచించాలి. బాగా ఆలోచించాలి. ఉదయమే ఎవర్ని అప్పు అడగాలో! వాళ్ళు లేదనకుండేటట్లు తనముఖాన్ని మలినంచేసుకోవాలి. వాళ్ళు నమ్మేట్లు తన అవస్థనువర్ణించాలి. అయినా లేదనడానికి అవతలవాళ్లకి చాలా తొందరుంటుంది. నిదానంగా ఆలోచించాలి!

"తాంబూలం వేసుకుంటుళ్ళు మామయ్యా! ఇంకా టైం వుంది."

"వొస్తాలేరా... తాంబూలానికేం."

"ఉత్తరాలు రాయిస్తూండుఅన్నయ్యా."

"అట్లాగేనమ్మా... రాముడూ... వస్తారా... ఏడవక తప్పకాదూ..."

"మీ సుబ్బారావును ఒక్కసారి పంపించు మామయ్యా... పండగ నాలుగురోజులు యిక్కడ వుంటాడు సరదాగా." సత్యం అంటూన్నాడు.

"ఏమిటో అల్లరిమూక... ఎక్కడికి పంపిద్దామన్నా భయం...సరే అట్లాగేలే... నేను వుంటా..."

"అత్తయ్యను కూడా పంపించు... చాలారోజులయ్యింది చూసి."

వెళ్లిపోయినాడు బంధువు సత్యం రాముడిని సముదాయిస్తున్నాడు. "ఏంటి నాన్నా బాధ... కడుపులోనా... ఎక్కడ... ఎల్లుండి డాక్టరుకు చూపిస్తాగా...వూరుకో యిక..."

"ఛ. ఛ. మాయగోల ప్రొద్దుటినుంచీ. గారాబం చేస్తూంటే మరీని." సత్యంభార్య అంటూంది.

"నీకెందుకే నోరుమూసుకుని వూరుకోక. నాన్నా... వూరుకో... చాక్‌లెట్లు తెస్తాగా."

రాముడు ఏడుపును హెచ్చించేడు.

తాతగారు-"ఛ. ఛ. చెవులు పగిలిపోతున్నాయి" అని విసుక్కుంటున్నారు.

"ఊరుకో బాబూ! ఇక తగుల్తాయి." సత్యం అంటున్నాడు.

తను ఆలోచిస్తున్నాడు. ఉదయాన్నే అప్పుకు బయలుదేరాలి. సుందర్రావు దగ్గర ఏమైనా వుండొచ్చు. ఎవ్వరూ లేవకమునుపే, ముఖ్యంగా-సత్యం లేవకమునుపే వెళ్ళి సుందర్రావునుపట్టుకోవాలి. అప్పు దొరకకపోతే ఏమౌతామో అనే ఆలోచన వచ్చేసరికి తన వళ్ళు జలదరించింది.

"నోరుముయ్యి. మూస్తావా లేదా?" అరుస్తూన్నాడు సత్యం.

రాముడు వెక్కి వెక్కి ఏడుస్తూనే వున్నాడు.

"వెధవా! నోరుమయ్యమంటే." ఛళ్ళున దెబ్బ పడింది రాముడిపైన.

సామాన్య గుమాస్తాలాగ ఏడుస్తూన్నాడు రాముడు. స్వరంలో ఆకలీ, బాధ, నైరాశ్యం, నీరసం స్ఫురించేట్లు బిగ్గరగా ఏడుస్తూన్నాడు రాముడు.

"అట్లాగే ఏడ్చి ఏడ్చి చావు...నాకేం."

రేకులలోని కంతలోంచి చూచేడు తను అవతలి వాటాలోకి. రాముడు వో మూల వొదిగి ఏడుస్తూన్నాడు. సత్యం చాపపైన కళ్ళు మూసుకుని పడుండి వున్నాడు.

తను ఆలోచిస్తున్నాడు సత్యం ఆలోచన ఏమిటా అని.

"ఎప్పుడీ బాధలకి అంతం? ఎప్పుడు?"

రాముడు గుండెలు పగిలేట్టుగ ఏడుస్తున్నాడు. రాముడి ఏడుపులో మనస్సును కలపి నిశ్చయంగా, తన్మయత్వంతో విలపిస్తూన్న సత్యంముఖం తన కళ్ళముందు ఆడుతోంది.

తను ఆలోచిస్తున్నాడు మానవులంతా యిట్లాగే విలపిస్తున్నారా అని- ★





# ఎలెక్షన్ల ఇంజనీరు

(22-వ పేజీ తరువాయి)

ఖాటుమీద ఎక్కువ ధర పలుకుతుంది. ఈ అదనపు లాభాన్ని ఆ ముఠాలో ఎవరు పెద్ద బేరగాళ్ళయితే ఆయనగారు గుటకాయస్వాహా చేస్తాడు."

"చాలా పార్టీలు పెనుగులాడుతున్నప్పుడు మాత్రమే ఈ ఎత్తులు పనిచేస్తయ్యేమో!" "ఆమాట నిజమే. చాలా పార్టీలు లేనప్పుడు ప్రతికూల పక్షంలో ఉన్న పెద్దనోటివాళ్ళను ముఠాలోనికి చేర్చుకొనే ప్రయత్నిస్తారు. ఒకాయన నోటికి దడిసి అధికారపక్షంవాళ్ళు ఏమయినా బహూకరిస్తే, ఆయన సహచరులకి కొంచమయినా లాభించక పోతుందా?"

'కాని ఒక్కటే సందేహం. తాత్కాలిక లాభాలకూ, ఆకర్షణలకూ లొంగిపోయి వోటును ఎవళ్ళకు పడితే వాళ్ళకు ఇస్తే, వొచ్చేటరం వరకూ ఇబ్బంది పడాల్సొస్తుందని ప్రజలకు తెలీయదూ?"

"కాని ఎవరిమాటను నమ్మకు సేట్లు! ఇదివరకు రోజుల్లో రామాయణం పట్టుకున్నవాడు నిజమే చెప్పేవాడుట. అట్లాగే ఈ రోజుల్లో ఎన్నికలకు నిలబడేవాడు అబద్ధమే చెపుతాడని జనం అనుకుంటారు. ఇయితే అందుకు వాళ్ళకు కోపం రాదులెండి. ఏదో కక్కుర్తికి, ఆపద్ధర్మంగా అబద్ధం ఆడతాడని మాత్రం అనుకుంటారు."

"మీరు ప్రతిదాన్నీ ఏదో చమత్కరించాలని చూస్తారే?"

"అసలు ఉన్న సంగతే అది. పార్టీలకు పార్టీలే రోజు కొక్క కొత్తపార్టీని అనుసరిస్తారాయె! వాగ్దానాలను బుట్టదాఖలు చేయటంకోసం నైతికవిలువలు మారటం మొదలుకుని ఆటంబాంబులు పేలటంవరకూ ఏకరువు పెడతారాయె! అడిగిందే తడవుగా కోరిక లన్నిటినీ తీరుస్తామని వాగ్దానాలు చేస్తారాయె! మరి ఇప్పుడు చెప్పిన మాటల్ని తరవాత అనుసరిస్తారని హామీ ఏమిటి?"

"అట్లాగయితే వోటింగన్నది చివరకు అభ్యర్థి నిజాయితీమీదనూ, వోటు చేసే వాళ్ళ అవసరాలమీదను ఆధార పడిఉన్నదన్నమాట."

"లేకపోతే ఏమనుకుంటున్నారు?"

"అయితేమీ ఇంజనీర్లు చేసేదేమిటి?"

"అభ్యర్థుల నిజాయితీమీదనుంచి ప్రజల దృష్టిని మళ్లిస్తాము. 1947 వరకూ స్వాతంత్ర్యాభిలాష చాల గాఢంగా ఉండేది కనుక, దేశంపేరు చెప్పి పూచికపుల్లను నిలబెట్టినా వోట్లుపడేవి. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. కనుక కొత్తసమస్యలను సృష్టించాలి."

"ఉన్న సమస్యలు చాలకనా? తిండీ, గుడ్డా కన్నా పెద్ద సమస్య లేమిటి?"

'హాహ్హాహా' అని ఇంజనీరు బిగ్గరిగా నవ్వేశాడు.

"మీ ఇల్లు బంగారంగానూ బలేవాళ్ళండీ! ఆ సమస్యలు ఇంతటితో తేలేవా? వాటిని కదిలిస్తే మన సత్తా ఏమిటో ఏరోజు కారోజు జనానికి తేలిపోతుందికదా! అందువల్ల వాళ్ళు మనల్ని పట్టుకునేందుకు వీలులేకుండా, దూరాన మెరిపించటానికి వీలయ్యే సమస్యల్ని మాత్రమే ఏరుకోవాలి."

"ఇప్పుడు మీరు వేటిని స్పెషల్ గా తీసుకుంటున్నారు?"

"మనకు పాకిస్తాన్ వల్లనే అసలు ముప్పు అని చెప్పటం మొదటిది. మన సరిహద్దుల్లోనే కమ్యూనిస్టులు కాలుదువ్వుతున్నారనటం రెండవది. వీటికే 100 కి 90 మంది బెదిరిపోతారు."

"ఇంకా మరేమయినా—"

"భాషాపోషణ, సంస్కృతివ్యాప్తి మొదలైనవి దీనికి బాగా పనికొస్తయ్. ఇంకపోతే, మనకు సంబంధం ఉన్నా లేకపోయినా, ప్రజలకు అభిమానం ఉన్న అంశాలకు ఏదోవిధంగా సంబంధం కల్పిస్తాము."

"మచ్చుకు ఒకటి చెప్పండి."

"అజాద్ హింద్ ఫౌజ్ వ్యవహారం ఉన్నదనుకోండి. అసలు అది నిలబడ్డ రోజుల్లో దానిమీద కారాలు మిరియాలు నూరినప్పటికీ, వోట్లఅవసరం వచ్చినప్పుడు దానితో పూసుకునితిరగటం ఇటువంటిదే. ఇట్లాగే 1942 ఆగస్టు ఉద్యమంతో సంబంధం లేనివాళ్ళు అనేకమంది, కిందటి ఎన్నికల్లో దాని పేరు చెప్పుకుని వోట్లు సంపాదించారు."

"ఈ తడవ అటువంటి సమస్య ఏమిటి?"

"ఆంధ్రరాష్ట్ర సమస్య. ఇదిగో, ఈ ఒక్క కాగితంమీద సంతకం పెడితేచాలు, తెల్లవారేటప్పటికి రాష్ట్రం తెస్తామని ఒకరంటారు. కత్తిరింపుల రాష్ట్రానికి దేబిరించటం దేనికి, సువిశాలరాష్ట్రం తెస్తామని కొందరంటారు."

"మీ ఇంజనీర్లు స్వయంగా చేసేదేమిటి?"

"మా పార్టీకి ఇటువంటి సమస్యలను సంపాదించిపెడతాము. జనానికి అభిమానం ఉన్న వ్యవహారాలతో లంకెకలుపుతాము. మా వాళ్ళు బలహీనంగా ఉన్నచోట్ల ఎదటిపార్టీల వోటును చీలదీయటానికి ప్రయత్నిస్తాము. ఎదటి పార్టీలకు చెందిన మిడిమేలపు పెంకెఘటాలు ఎన్నికలకు నిలిస్తే, మిగిలిన అన్ని పార్టీలనూ కూడగట్టుకుని వాళ్లని నెగ్గకుండా చేస్తాము. కనకవర్షం, ఉద్యోగాలవర్షం, అన్నిటికన్నా ఎక్కువగా వాగ్దానాలవర్షం ఇందులో ఉపయోగిస్తయ్."

"ఆమీదట?"

"ఎదటి అభ్యర్థుల నామినేషన్లు సరిగా లేవని కోర్టుల్లో దావాలు వేస్తాం. అవి తప్పితే ఇంజక్షన్లు, స్టేఆర్డర్లు తెప్పించి, క్రిమినల్ కేసులు బనాయించి నాటకం ఆడతాం. అవీ తప్పితే ఎన్నికలు చెల్లవని దావాలు పడేస్తాం. ఒకరాయి కాకపోతే మరొక రాయి తగలదూ?"

"తగలకేం చేస్తుందిలెండి? మీ వృత్తి బాగా అభివృద్ధిఅయిన దేశాల్లో వ్యవహారం ఎట్లా జరుగుతుంది?"

"వాళ్ళు ఇంకో మెట్టు పైకి పోతారు. స్థానిక అధికారులను లోగట్టుకుని బాలట్ పెట్టెలను తారుమారు చేయిస్తారు. లేకపోతే రౌడీలచేత కొట్లాటలు లేవదీయించి, శాంతి భద్రతలు లేవు కనుక ఎన్నికలు జరపటానికి వీలులేదని ఉత్తరువు చేయిస్తారు. మనదేశంలో మటుకు వ్యవహారం అంత ముదరలేదనుకుంటాను."

"అయితే ఎన్నికఫలితాలు ప్రకటన కావటంతో మీరు చేతులు కడుక్కుంటారన్నమాట."

"నిజానికి అంతే. అయితే నేనుమాత్రం తీవ్రంగా ఆలోచించి ఒక ఉపాయం కనిపెట్టాను."

"ఏమిటది ?"

"ఏ పరిస్థితుల్లోనూ మనవాళ్ళకు గెలిచే అవకాశం లేదనుకోండి. అప్పుడు గుప్‌చిప్‌గా మనవాళ్ళు కొందరికి ఎదటిపార్టీ టిక్కెట్లను సంపాదించాలి. ఎన్నికలయిన తరవాత వాళ్ళు ఆ టిక్కెట్లను చించిపారేసి, మన టోపీలను పెట్టుకుంటూరు."

"అది సక్రమంగా ఉండదేమో ?"

"ఎందుకు ఉండదు ? ఎన్నిక అయిన వాళ్ళు ఏ పార్టీలో ఉన్నా ఎవ్వరూ అడగటానికి హక్కు లేదు. ప్రజలకు రాజ్యాంగంలోనే ఆ హక్కు లేదు. ఇంక టరం పూర్తయేవరకూ మన్ని అడిగే దెవరు ?"

"రెండో టరంలో టిక్కెట్లు ఇచ్చే దెవరు ?"

"అప్పుడు మనం చేసిన పనులకి 'పశ్చాత్తాప' పడి, తిరిగిపార్టీలో జేరతాంగా!"

ఇంజనీరుగారి అఖండప్రజ్ఞకు నిశ్చేష్టుణ్ణయినాను. కాని ఇంతలో ఆయన బల్లమీద ఫోను మోగటంవల్ల సందు చూచుకుని బయటపడి, గుక్క తిప్పుకున్నాను. ★

# తెగిన జోడు

## (17-వ పేజీ తరువాయి)

ర్భించడానికి ? ఈ శనిగాడిని అవతలి ఫుట్‌పాత్ మీద చూసే, ఎక్కడ పిలుస్తాడోనని తలొంచుకొని గొబ్బిడాటుగా పోతున్నా. పోనీ పోతున్నాడుగదా అని ఊరుకో వచ్చునా, మహా రాచకార్యమున్నట్టు వచ్చాడు. వాడొక్కడే అయితే నాకింత కోపం వచ్చేదికూడా కాదు. వాడి వెంట మరో ఇద్దరు కూడా అఘోరించారు...ఛీ...ఛీ...ఇవాళ ఇంతకూ లేచిన వేళ మంచిది కాదని తిట్టుకున్నా. "ఏంరా... మాట్లాడవేం......ఏమిటలా బిత్తరపోయి చూస్తున్నావు ?" అన్నాడు తిరిగి శాస్త్రి. "ఏదో పరాగ్గాపోతున్నా లేరా" అన్నాను. శాస్త్రివాళ్ళిద్దరినీ నాకు పరిచయంచేశాడు. పరస్పరం నమస్కారాలు సమర్పించుకున్నాం. "ఏమిట్రా చేతిలో పొట్లం ?" అని శాస్త్రి ప్రశ్నించాడు. నా గుండె గతుక్కు మందంటే నమ్మండి. అసలు వీడికీ అజలన్నీ ఎందుకూ అంట. ఏ మనుకుంటే ఏం లాభం ? ఇంతకూ నన్ను భగవంతుడు పరాభదావాగ్నిలో మసిచేయాలనుకున్నాడో ఏంపాడో ననిపించింది. కళ్ళకు కనపడేవాడైతే, కాళ్ళావేళ్ళాబడి బ్రతిమాలే వాడిని. అంతగా వినకపోతే, జీతంవచ్చాక ఒక రెండురూపాయలు లంచమన్నా ఇచ్చేవాడిని, ఆనెల బడ్జెటులో అబ్బిగాడి పాల ఖర్చు మార్చేసి. ఒప్పుకుంటాడా అనేది తర్వాత సంగతి. లంచానికి కానిపనంటూ ఉంటుందా మీరే చెప్పండి. ఇంతకూ శాస్త్రి ప్రశ్నకు నీళ్ళు నమలాల్సి వచ్చింది. "కొత్త చెప్పులు కొన్నావా." అన్నాడు. "ఊఁ" అంటే అంతటితో ఆ ప్రసంగం తెగిపోతుంది కదా అనుకొని వినపడీ వినపడనట్టు "ఊఁ" అన్నాను. కానీ లోపల భయం పీకుతూనే ఉంది. ఎక్కడ చూపెట్టమంటాడోనని. వీడి పిల్లిచెవులు చిల్లులు పడ వాడు అడగనే అడిగాడు, "ఏదీ...చూపెట్టు"మని. పరాభవం తప్పదనుకున్నాను. "హే గోపాల కృష్ణా! ఆపద్బాంధవా! నామానం రక్షించవా!" అని ద్రౌపదిలా కృష్ణుణ్ణి ప్రార్థిస్తే అనుకున్నాను. కాని ఆ మాయదారి కృష్ణుడికి నా మొర వినే యోగ్య తేవుంటే, దివ్యంగా ఉండేవాడే! లేదు కాబట్టే అవతారం ఏనాడో చాలించాడు. నేను శాస్త్రిమాట వినిపించుకోకుండా మాట తప్పిద్దామని ప్రయత్నిస్తున్నా, వాడు చంకలోంచి పొట్లం లాగనే లాగాడు. ఇంకేముందీ! నా బ్రతుకు బండారమైంది. ముగ్గురూ పకపకా నవ్వారు. తలెత్త లేకపోయాను. మొహాన నెత్తురుచుక్క ఉందో లేదో కూడా సందేహాస్పదమే! వాళ్ళ నవ్వులు నన్ను పిచ్చెత్తించాయి. నాలో ఉక్రోషం ఉరకలు పెట్టింది. కోపంకట్టలు తెగిపారింది. "ఎందుకూ పకపకానోరంతా తెరుచుకు నవ్వుతారు ?...అంత నవ్వే వాళ్ళు, ఒక చెప్పులజోడు కొనివ్వకూడదూ దమ్ముంటే "అన్నాను. "శాంతించరా బాబు...శాంతించు" అంటూ శాస్త్రివీపు మీద తట్టాడు. "ఏడ్చావులే" అంటూ వాడిచేతిలోంచి ఆ తెగినజోడునులాక్కొని తిరిగి చూడకుండా నడకసాగించా. వెనకాల వాళ్ళింకా నవ్వుతూనే ఉన్నారు. ఛీ...ఛీ...ఈ తెగిన జోడు ఎంత ఏడిపిస్తున్నది. ఎంత పగసాధిస్తున్నదో చూశారూ? ఇవి ఇలాగే చంకన పెట్టుకొని నడుస్తుంటే, ఇంటికి పోయేలోపల ఇంకా ఎన్ని పరాభవాలు జరుగుతాయోనని భయపడ్డాను. పోనీ ఎక్కడైనా అప్పుజేసి, కొత్తజోడు కొందామా అనిపించింది. సరే ఏమాతే అవుతుందని, ఆ తెగిన చెప్పులజోడుదు, ఎవరూ చూడకుండా, ప్రక్కనేవున్న చెత్తకుండీలోకి విసిరాను. కాని తర్వాత ఎందుకు పారేశానా అనిపించింది. రెండున్నరసంవత్సరాలనుంచివాడుతున్నానూయె. నన్నాశ్రయించుకున్న జోడును దిక్కులేనిదాన్నిగా చేసి చెత్తకుండీలో పారేశానే అనిపించింది. దానిమీదగల మమకారంతో ఆ చోటును వదలలేక వదలేక, వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ నీరసంగా ఇంటిమొహం పట్టాను. ★

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(6-వ పేజీ తరువాయి)

మనమందరం తిరిగి మనకోటకి వెళ్లవచ్చును. లేదా, మనమిరాత్రే పారిపోవాలి."

'కాని మనల్ని పారిపోనివ్వకపోతే?' అంది అమ్మ 'ఫరవాలేదు' అన్నాడు పాషా. సలీమ్ కాగడా పట్టుకుని సిద్ధంగా ఉన్నాడు. మన గౌరవ ప్రతిష్ఠల్ని తుపాకి మందు సహాయంతో కాపాడగలను.' ఇలా అంటూనే నా తండ్రి ఉలిక్కి పడ్డాడు. దూరాన చిన్న నావ కనపడింది. దానికి వెనుక మరి మూడు నావలు కనపడ్డాయి. పిస్తోలుచేత పట్టుకుని పాషా లేచి నిలబడ్డాడు. ఆఖరు సారి నన్నెత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు. తరవాత మా అమ్మ నేనూ లోనికి వెళ్లి పోయాం. ఒక గవాక్షంగుండా చూసేసరికి దూరాన నావలగుంపొకటి కనపడింది. మా అమ్మ వొణికిపోతూ నిలవలేక పోయింది. నన్ను నడిపించుకుని వెళ్లి సలీమ్‌వద్ద కూర్చుంది. ఏదో ప్రమాదం సంభవించనున్నదని నన్నా భీతి ఆవహించింది."

హైదీ కొంతసేపాగింది. ఆల్బర్ట్ ఇదివరలో జెనీనా పాషా వృత్తాంతం విన్నాడు. కాని అతని కుమార్తె చెప్తూన్న వృత్తాంతం దానికి భిన్నంగా ఉంది.

"తరవాత ?" అన్నాడు మాంట్ క్రిస్టో.

"తరవాతనా ? నా తల్లి దైవప్రార్థన చెయ్యసాగింది. సలీమ్ కూడా దైవప్రార్థన మొదలుపెట్టాడు. అప్పటికి నాలుగు గంట లౌతుంది. మా అమ్మ మరొకసారి వెళ్లి గవాక్షంగుండా చూసింది. నావలు సమీపించాయి. మొదటినావలో ఫ్రెంచి ఉద్యోగిని మా అమ్మ గుర్తుపట్టింది. కొంత తేరుకుని మెల్లిగా సలీమ్‌ను సమీపించింది. 'సలీమ్ వాళ్ళు వచ్చారు. మనకి చావో స్వేచ్ఛో తేలిపోతుందింక' అంది. 'మనకేం భయం మహారాణీ?' అన్నాడు సలీమ్. 'స్వేచ్ఛ ఇవ్వనంటే పోరాడుతాం. మనం నాశనమైనాసరే వాళ్ళకి లొంగడం ఉండబోదు.'

మా అమ్మ మెల్లిగా అడిగింది: 'సలీమ్! నీకు పాషా ఏమాజ్ఞ ఇచ్చారు?'

సలీమ్ చెప్పాడు: 'నాకు పాషా తన కత్తిని పంపితే టర్కిష్‌సుల్తాన్ క్షమించలేదని అర్థం. ఆ కత్తిచూసి నేనీ తుపాకి మందుకి నిప్పుముట్టించి ఈ కోటని ధ్వంసం చెయ్యాలి. లేక ఆయన తన ఉంగరాన్ని పంపితే శుభవర్తమానం అందిందన్నమాట. వెంటనే ఈ కాగడా ఆర్పివేస్తాను.'

'సలీమ్! నీకే కత్తి పంపితే ఈదారుణం నేను భరించలేను. ముందు నన్నా కత్తితో పొడిచిచంపుతానని మాటిస్తావా?'

'అలాగే రాణీ' అన్నాడు సలీమ్.

"ఇంతలోనే మిద్దెపైనుంచి సంతోష సూచకమైన ధ్వానాలు వినవచ్చాయి. మెట్లపైన పదధ్వనులు వినవచ్చాయి. సైనికాధికారి దుస్తులను ధరించిన ఒక వ్యక్తి దిగివచ్చాడు. సలీమ్ అతని నక్కడనే ఆపివేశాడు.. 'ఆగండి మీ రెవరైనప్పటికీ ముందుకి ఒక్క అడుగు వెయ్యకండి' అన్నాడు.

ఆ వ్యక్తి అక్కడ నిలబడి ఇలా చెప్పాడు: 'సుల్తాన్ పాషాను క్షమించారు. అంతేకాదు. కోటనూ ఆయన ధనాన్నీ పదవినీ తిరిగి ఇచ్చారు.' మా అమ్మ సంతోషం పట్టలేక పాషాను పిలిచి మెల్లెక్కబోయింది. 'ఆగు రాణీ' అన్నాడు సలీమ్. 'ఇంకా నా చేతికి ఉంగరం రాలేదు.'

ఆ వ్యక్తిని సమీపించి సలీమ్ పరిశీలించాడు. వచ్చిన వ్యక్తి ఫ్రెంచిఉద్యోగి అని గమనించాడు. 'మిమ్మల్ని ఎవరు పంపారు?' అన్నాడు సలీమ్.

'నా యజమాని పాషా పంపారు. ఇదిగో ఆయనవద్దనుంచి ఉంగరం తెచ్చాను' అన్నాడు నూతనవ్యక్తి.

'మీ చేతిలో ఏముందో నాకు కనిపించడం లేదు. మీ చేతిలో ఉన్నది అక్కడ ఉంచి వెనక్కు వెళ్లండి' అన్నాడు సలీమ్. ఫ్రెంచిఉద్యోగి సమీపంలో దానినుంచి వెనక్కు వెళ్లాడు. సలీమ్ దానిని పరిశీలించి తృప్తిపడ్డాడు. కాగడా ఆర్పివేసి శూలం కింద పడవేశాడు. చేతులెత్తి భగవంతుని స్తుతించాడు. సరిగ్గా ఆ క్షణంలో నలుగురు సిపాయిలు వచ్చి హఠాత్తుగా సలీమ్‌ను చుట్టుముట్టారు. నలుగురూ టర్కిష్ సుల్తాన్ పంపగా వచ్చి జెనీనా కోటవద్ద పోరాటం చేసిన టర్కిష్ సిపాయిలు. నాలుగు కత్తిపోట్లతో సలీమ్ ఒరిగిపోయాడు. మా అమ్మ వెంటనే నన్నెత్తుకుని గుప్తమార్గం గుండా పరుగెత్తింది. పరుగెత్తి నా తండ్రి వద్దకు వెళ్లింది. నా తండ్రి చుట్టూ మరికొందరు సిపాయిలున్నారు. 'ఇదిగో ఫర్మానా' అన్నాడొక సిపాయి. నా తండ్రి ఫర్మానా చూశాడు. 'ఇదేమిటి?'

అన్నాడు. 'అవును' అన్నాడు సిపాయి. 'అవును. మిమ్మల్ని శిరస్సు ఛేదించి తీసుకురావాలని సుల్తాన్ ఆజ్ఞ.'

నా తండ్రి వికటాట్టహాసం చేశాడు. వెంటనే దొమ్మి ప్రారంభమయింది. కత్తులు ఖణఖణమన్నాయి. తుపాకులు పేలాయి. ఈ సమయంలో వెనుకనుంచి నలుగురు సిపాయిలు వచ్చి నా తండ్రి పైన తుపాకులు కాల్చారు. నా తండ్రి అప్పుడే ఒరిగిపోయాడు. క్షణంలో ప్రాణాలు పోయాయి. నా తల్లి స్పృహ తప్పి పడిపోయింది. నన్నూ అమ్మనూ ఫ్రెంచి ఉద్యోగి ఆధీనం చేసుకున్నాడు. ఫ్రెంచి ఉద్యోగి ద్రోహం చేశాడు.

హైదీ ఇంక చెప్పలేక పోయింది. కోపమూ దుఃఖమూ ఆమెకు పెనగొన్నాయి. "హైదీ! దుఃఖించకు ద్రోహుల్ని భగవంతుడే శిక్షిస్తాడు" అన్నాడు. మాంటె క్రిస్టో.

"ఘోరం" అన్నాడు ఆల్బర్ట్."

"అవును ఘోరమే" అంది హైదీ. ఇంతేకాదు. నా తల్లి సుల్తాన్ పంపిన టర్కిష్ సైనికాధికారిని ప్రాధేయపడింది, 'నన్ను చంపండి. అవమానం మాత్రం చెయ్యకండి' అని బ్రతిమాలుకుంది 'నన్ను కాదు నువ్వు అడగవలసింది' అన్నాడు. 'మరెవరిని?' 'నీ కొత్త యజమానిని. అడుగో అక్కడున్నాడు, ఫ్రెంచి ఉద్యోగి మా అమ్మ పక్కి పక్కి ఏడ్చింది. నేనూ మా అమ్మ ఫ్రెంచి అధికారి వశమైనాము!!

"తరవాత మాంటె క్రిస్టో వద్దకు వచ్చారా?" అన్నాడు ఆల్బర్ట్.

"కాదు. మమ్మల్ని తన అధీనంలో ఉంచుకునే ధైర్యం ఫ్రెంచి ఉద్యోగికి లేకపోయింది. కాన్‌స్టాంటి నోపిల్ నగరం వెళ్ళి బానిస వర్తకులకు మమ్మల్ని ఇద్దరినీ అమ్మివేశాడు. ధనమంతా దోచుకుని తన దేశం తరలించుకు వెళ్ళాడు. మేమిద్దరం వర్తకులవెంట ఆ నగరం వెళ్ళాం. నడవద్వారంవద్ద పైకిచూసి నా తల్లి కవ్వున కేక పెట్టి పడిపోయింది. నేనూ పైకిచూశాను. అక్కడ నాతండ్రి శిరస్సు వ్రేలాడుతోంది. గోడనుంచి క్రిందికి చూశాను. నాతల్లిని కదిపిచూశాను. కాని అప్పటికే ఆమె ప్రాణాలు విడిచింది. తరవాత ఆనగరంలో నన్ను బానిసగా మాంటె క్రిస్టో కొన్నారు."

# 71

ఫ్రాంజ్ తన తండ్రి హత్యావృత్తాంతం తెలుసుకుని కల్లోలిత హృదయంతో ఇంటికి చేరుకున్నాడు. ఆపూటే విల్‌ఫర్ట్‌కి చిన్న లేఖ వ్రాసిపంపాడు. ఈ వివాహం జరగడం అసంభవమని ఫ్రాంజ్ తెలియపరిచాడు.

విల్‌ఫర్ట్ లేఖ చదువుకుని శిరస్సు వంచుకున్నాడు. అతనికి పరాభవమైనట్లు బాధపడసాగాడు. వాలంటిన్ తాతగారి గది నుంచి బయటపడగానే తోటలోకి వెళ్ళింది. గోడవద్ద మాక్సిమిలియన్ నిరీక్షిస్తున్నాడు. "మనం బతికిపోయాం మాక్సిమిలియన్ మా తాతగారే రక్షించారుసుమా!" అంది వాలంటిన్. మాక్సిమిలియన్ ఆనంద వివశుడైనాడు.

"చెప్పు వాలంటిన్! ఏం జరిగింది. అంతా చెప్పు."

వాలంటిన్ క్షణంసేపు ఆలోచించింది. తన కుటుంబానికి సంబంధించిన రహస్యం తెలపడానికి సంకోచించింది.

"తరవాత మరొక రోజున చెప్తాలే మాక్సిమిలియన్" అంది.

"తరవాతంటే? ఎప్పుడు?"

"మన వివాహం అనంతరం."

ఇంక ఇప్పుడేది చెప్పినా వినడానికి మొరెల్ సిద్ధంగానే ఉన్నాడు. తరవాత ఇద్దరూ ప్రియవాక్కులతో ఒకరి నొకరు అనుసరియించుకున్నారు.

ఈ సమయంలో హిలాయిస్ విల్‌ఫర్ట్ మామగారివద్ద చేరింది. "వాలంటిన్‌కి ఈ వివాహం జరగదని వేరే మీకు చెప్పనవసరం లేదనుకుంటాను. మీరు కోరుతున్నట్లే జరిగింది. ఫ్రాంజ్ యీ లేఖ వ్రాశాడు. మీ కిష్టంలేని ఈ వివాహం చెడిపోయింది కాబట్టి మీతో ఒక పనిమీద వచ్చాను."

ఏమిటా పని అన్నట్లు చూశాడు వృద్ధుడు. "మీ వీలునామా చింపివేసి, వాలంటిన్‌కి చెందేలా మరొకటి వ్రాయండని చెప్పడానికి వచ్చాను."

"వృద్ధుని నేత్రాలలో సందేహం పొడగట్టింది. ఈమె ఎందుకిలా అడుగుతున్నది? "మీ కిష్టమేనా?" అంది హిలాయిస్ విల్‌ఫర్ట్. ఆమె ముఖంలోనికి వృద్ధుడు పరిశీలనగా చూశాడు. తరువాత సమ్మతం సూచించాడు. మరునాడే న్యాయవాది వచ్చాడు. కొత్త మరణ శాసనం వ్రాయబడింది. వృద్ధుడు తన ఆర్జనంతా తన అనంతరం వాలంటిన్‌కి సంక్రమింప చేస్తూ వ్రాయించాడు. వాలంటిన్‌కి సంక్రమిస్తున్న భాగ్య సంపదల్ని గురించి పారిస్ నగరంలో అందరూ గొప్పగా చెప్పుకో నారంభించారు

అదే సమయంలో మాంటె క్రిస్టో మార్సెర్ఫ్‌ను దర్శించి డాంగ్లర్ చెప్పిన కర్తవ్యం నెరవేర్చాడు.

మరునాడు ఉదయమే కౌంట్ మార్సెర్ఫ్ డాంగ్లర్‌ను దర్శించాడు. డాంగ్లర్‌ను చూసి "బారన్! నేను రావడం ఆలస్యమయినమాట నిజమేనని ఒప్పుకుంటున్నాను" అన్నాడు.

డాంగ్లర్ ముఖం ముడతలు పడింది. "దేనిని గురించి చెప్తున్నారు?" అన్నాడు

మార్సెర్ఫ్ నవ్వు కాని నవ్వు నవ్వాడు. "మీ కుమార్తెను నా కుమారునికిచ్చి వివాహం చెయ్యాలనీ ఇదివరలో ఇద్దరం అనుకున్నాం. దానిని గురించి" అన్నాడు. ఇలా చెప్పి డాంగ్లర్ వంక ఆతృతతో చూశాడు. కాని డాంగ్లర్ నిర్లక్ష్యభావంతో "కౌంట్ ఈ విషయమై నేను మరొకసారి ఆలోచించాలి" అన్నాడు. "ప్రపంచంలో అన్నీ ఎప్పుడూ మారుతూనే ఉంటాయికదా. వాటితో పాటే మనస్సులు మారడం కూడా ఉంటుంది."

"అంటే?"

"అంటే, ఈ మధ్య కాలంలో జరిగిన మార్పులవల్ల మనం ఇదివరలో అనుకున్నవి కొనసాగక పోవచ్చునని."

"ఇందుకోసమేనా మాంటె క్రిస్టోవల్ల నాకు కబురుపంపించారు?"

డాంగ్లర సమాధాన మివ్వలేదు.

"ఇంత త్వరలో మీ మనస్సు మారిపోవడానికి కారణమేదైనా ఉందా? లేక నన్నవమానించడం కోసమే నాకు కబురు పంపారా?"

డాంగ్లర్ మౌనంగా ఊరుకున్నాడు,

"మీ సమాధానంకోసం, మీ దయకోసం కనిపెట్టుకుని ఉంటానని భ్రమపడుతున్నారా?"

"నేను భ్రమపడ్డం లేదు. మీకు ఓపిక లేకపోతే ఈ సంబంధం అనవసం."

"మనం చిరకాలం మిత్రులుగా ఉన్నాం. అందుకోసమైనా మీరు నాకు కారణం తెలపడం ధర్మం."

"ఆల్బర్ట్ గురించి నా కెలాటి విముఖతా లేదనిమాత్రం చెప్పగలనంతే."

"అయితే మీ విముఖత ఎవరిపట్ల?" అన్నాడు మార్సెర్ఫ్. అతని కోపం రెచ్చిపోతోంది.

"మనమా విషయాలేవీ తరచడం మంచిది కాదని నా ఉద్దేశం" అన్నాడు డాంగ్లర్.

"అంటే? అదేమిటో తెలుసుకునే హక్కు నాకుంది."

"తెలుసుకోడానికి ప్రయత్నించకండి.మన మింక ఈవిషయం

చర్చించడం మాని వెయ్యడం మేలు. కాలం గడిచిన కొద్దీ కళంకాలు మాసిపోగలవు.”

“కళంకాలా ? ఏమిటన్నారు ? చాలింక.” అంటూ మార్సెర్ఫ్ లేచి జవాబుకోసం ఎదురు చూడకుండా చరచర వెళ్లిపోయాడు.”

మరునాడుదయం పత్రిక రాగానే డాంగ్లర్ తెరిచి చూశాడు. అతనికి చేతులు వొణక నారంభించాయి ఒకమూల ‘జెనీనా’ అనే శీర్షికక్రింద పడిన చిన్న వార్తను చదివాడు. తృప్తిచెంది “ఇది చాలు. ఈ వార్త చదివితే అతనికే బోధపడుతుంది కళంకమేమిటో” అనుకున్నాడు.

సరిగ్గా అదే సమయానికి ఆల్బర్ట్ తన ఇంటిలో పత్రిక తెరిచి వార్తలు చూస్తూ ఇది కూడా చదివాడు. వెంటనే బయలుదేరి మాంట్ క్రిస్టో ఇంటికి వెళ్లాడు. మాంట్ క్రిస్టో పిస్తోలు సాధన చేసుకుంటున్నాడు. “వేళకాని వేళ వచ్చినందుకు క్షమించండి” అన్నాడు ఆల్బర్ట్.

“ఏమిటి సంగతి ? ఇంత తొందరగా వచ్చావేం ఆల్బర్ట్ ?”

"నేనివాళ ద్వంద్వయుద్ధం చెయ్యాలని నిశ్చయించు కున్నాను."

"ఎవరితో?"

"బోశాంప్‌తో"

"ఏంచేశా డతను?"

"అతని పత్రికలో ఒక వార్త పడింది. మీరే చూడండి" అని ఆల్బర్ట్ పత్రిక అందించాడు. వార్త ఇలా ఉంది: "జెనీనా: జెబలీన్ పాషాకు చెందిన జెనీనాకోటను టర్కిష్ సుల్తానుకు ఒప్పగించి పాషాను సుల్తాను అధీనం చేసినవాడు ఫెర్నాండో అనే పేరుగల ఒక ఫ్రెంచి సైనికోద్యోగి అని మా జెనీనా విలేఖరి తెలుపుతున్నాడు. ఇంతవరకూ ఈ రహస్యం గుప్తంగా ఉంచబడింది."

"ఇందులో ఏముంది?" అన్నాడు మాంటే క్రిస్టో.

"ఏముంది. ఆ వార్త నా తండ్రికి సంబంధించినది. పాషా క్రింద ఉద్యోగం చేసిన ఫ్రెంచి సైనికోద్యోగి నా తండ్రే. ఆయన పేరే ఫెర్నాండో."

"పాషా కింద మీ తండ్రి ఉద్యోగం చేశారా?"

"అవును."

"అయితే కోట ఒప్పగించినది నీ తండ్రేనని ఎవ రనుకుంటారు? ఎప్పుడో 1822లో జరిగిన దానినిగురించి ఇప్పు డెవరు విచారిస్తారు?"

"అందుకే దాని అంతు కనుక్కోవాలి. ఎప్పుడో జరిగిన దానిని పురస్కరించుకుని నా తండ్రిపైన ఈనాడు వదంతులు కల్పించడానికి ఎవరికి అవసరం కలిగింది? అదే తెలుసుకోడానికి బోశాంప్ వద్దకు వెడుతున్నాను. ఈ వార్త అసత్యమని అతను తిరిగి పత్రికలో ప్రకటించాలి. లేదా నాతో ద్వంద్వయుద్ధం చెయ్యాలి."

"అతనొప్పుకోడు. ఫెర్నాండోలు ఫ్రెంచి సైన్యంలో అనేకులుంటారు."

"అయినా ద్వంద్వ యుద్ధం తప్పదు."

"అయితే రేపు మళ్లీ తన పత్రికలో 'నిన్నటివార్తలో చెప్పబడిన ఫెర్నాండో కౌంట్ మార్సెర్ఫ్ ఒకరు కాదు? అని ప్రచురిస్తాడు. అప్పుడేమాతుంది?"

"పూర్తిగా వార్త అసత్యమని ప్రచురించేవరకూ నే నూరుకోను."

"నువ్వుచేస్తున్న పని న్యాయమైనదికాదు ఆల్బర్ట్"

"అయితే ద్వంద్వయుద్ధంలో నాకు మీరు తోడుండరన్న మాట."

"ఆల్బర్ట్! తొందరపడవద్దని నీకు సలహా ఇస్తున్నాను ద్వంద్వయుద్ధమంటే ప్రతిచిలిపి తగాకీ సిద్ధపడేది కాదు సుమా! నా సలహావిను. ముందుగా ఈవార్త నిజమో అబద్ధమో తెలుసుకో."

"ఎవరివల్ల?"

"హైదీని అడుగు. తన తండ్రి ఓటమికి నీతండ్రి కారకుడు కాడని ఆమె చెప్పవచ్చును. అడుగు. లేక అదే నిజమైతే..."

"నే నటువంటి మాట నమ్మను కౌంట్. నా తండ్రి అటువంటి వ్యక్తికాదు."

"అయితే మరొక సలహా చెప్తాను విను. బోశాంప్‌తో సావధానంగా మాట్లాడు. కూడా ఎవరినీ తీసుకువెళ్లకు. నీ రహస్యం కాపాడుకో."

"అలాగే చేస్తాను."

ఆల్బర్ట్ వెళ్ళేసరికి బోశాంప్ పత్రికా కార్యాలయంలోనే ఉన్నాడు.

"బోశాంప్! నువ్వు నాకు సంజాయిషీ ఇవ్వాలి?"

"దేన్ని గురించి?" అన్నాడు బోశాంప్ తెల్లబోతూ.

"నీ పత్రికలో పడిన ఒక వార్తగురించి. అది నా వంశప్రతిష్ఠకు సంబంధించినది."

"అదేమిటి? నువ్వు పొరబడ్డంలేదు కదా ఆల్బర్ట్?"

"లేదు. చూడు. జెనీనా అని వ్రాసిఉంది."

బోశాంప్ వార్త చదివాడు

"చూశావా? ఆ వార్త నా వంశ ప్రతిష్ఠకు భంగం కలిగిస్తుంది. అది అసత్యమని చెప్తూ మరొకవార్త ప్రచురించాలి."

"అదెల్లాగ?"

"విను బోశాంప్, మనిద్దరం చిరకాలం మైత్రితో ఉన్నాం. నీకు నా సంగతి తెలుసును."

"కాని నీ ధోరణి చూస్తే మైత్రి ఎక్కడా కనపడదే? నీకెందు కంత తొందరపాటు? చెప్పు ఈ ఫెర్నాండోకి నీకూ ఏమి సంబంధం ఉంది?"

"ఆయన నా తండ్రిగారే."

"ఎవరు? నీ తండ్రా? కాని అలాగ ఇందులో వ్రాయలేదే?"

"లేదు నిజమే. కాని ఇది చదివిన వారికి అర్థమాతుంది. నా తండ్రే పాషావద్ద ఉద్యోగం చేశారు. ఇది అసత్యమని ప్రకటిస్తావా బోశాంప్?"

"తప్పకుండా. కాని ఇది అసత్యమని ముందు రుజువు కావాలి."

"కాని ఇందులో రుజువు చెయ్యవలసింది ఏముంది? నీకు నా తండ్రినిగురించి తెలియదా? నా తండ్రి కాదని అనుకుంటే వార్త అసత్యమని తిరిగి ప్రకటించవచ్చుకదా! వార్త సత్యమని అనుకుంటే ఆ మాట స్పష్టంగా చెప్పు."

"అంటే?"

"అంటే, మనం ద్వంద్వ యుద్ధానికి సిద్ధపడాలి."

"ఆగు బెదిరింపులకు దిగవద్దు. ఈ వార్తను నేను ప్రచురించలేదు. కాని విషయాలన్నీ తెలిసినవారు అది అసత్యమని చెప్పేవరకూ నువ్వు చెప్పినట్లు ప్రకటించను.

"అయితే ద్వంద్వయుద్ధం తప్పదు." "నేను సిద్ధమే. కాని ఆల్బర్ట్! నువ్వు మిత్రుడవు కాబట్టి చెప్తున్నానువిను. మూడు వారాలు నాకు వ్యవధిఇయ్యి. ఈలోగా సత్యాసత్యాలు విచారిస్తాను. ఇవి అసత్యమైతే అలా ప్రకటిస్తాను. సత్యమైతే ద్వంద్వ యుద్ధానికి నేను సిద్ధమే."

"సరే అలాగే కానీ" అంటూ ఆల్బర్ట్ వ్యధిత చిత్తంతో, రోషంతో వెళ్లిపోయాడు.



# ఈగను చంపుడు

అది టైఫాయిడ్ జ్వరము-గ్రహణి-
కలరా-నీళ్ల విరేచనములు
క్షయ – ఆన్థ్రాక్సులను
వ్యాపింపచేయును



సామాన్యపు ఈగ ఒక తడవకు 120 గ్రుడ్లను పెట్టును. ఒక జోడు ఈగలనుండి కొద్ది వారాలలోనే లక్షలాది ఈగలు రావచ్చును.

గ్రుడ్డు దశనుండి అది పురుగు పేడ, క్రుళ్లిన ఆహారము మరియు మురికి కుప్పలలో ఉండును. చిన్న వెంట్రుకలు దాని ఒంటిపైనంతటా యుండుటచే అది పోయిన అన్ని చోట్లకు మురికిని తీసుకొని పోవును. ఒక్క ఈగ మీద 6,000,000కు పైగా క్రిములు ఉన్నట్లు కనుగొనబడినది.

జ్ఞప్తి యుంచుకొనుడు: ఫ్లిట్ లోగల 5 తీవ్రమగు కీటక నాశనులు ఈగలను మరియు అన్ని కీటకములను త్వరగా, నిశ్చయముగా చంపును

మిమ్ము సోకుటకు ముందు ఈగను చంపుడు!

FLIT
"DDT"
KILLS

# ఫ్లిట్

మీరు ఖర్చు చేయు ప్రతి అణాకు
ఎక్కువ ఈగలను చంపును

FLIT

స్టాండర్డ్–వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (మెంబర్ల బాధ్యత పరిమితము)

## సినిమా వార్తలు

(39 వ పేజీ తరువాయి)

11. షావుకారు
12. శ్రీలక్ష్మమ్మ కథ
13. స్వప్నసుందరి
14. సాయిబాబా
15. తిరుగుబాటు
16. వాలిసుగ్రీవ.

తెలుగు స్త్రీ తారలు

1. అంజలీదేవి
2. భానుమతి
3. జానకి
4. కుమారి రుక్మిణి
5. కృష్ణవేణి
6. లక్ష్మిరాజ్యం
7. శాంతకుమారి
8. టి. సూర్యకుమారి
9. శ్రీరంజని
10. జి. వరలక్ష్మి
11. ఎస్. వరలక్ష్మి
12. వైజయంతిమాల

తెలుగు పురుష తారలు

1. సి. ఎస్. ఆర్. ఆంజనేయులు
2. వి. నాగయ్య
3. నాగేశ్వరరావు
4. నాగేంద్రరావు



"మానవతి" చిత్రంలో నారాయణరావు, జి. వరలక్ష్మి

5. సిహెచ్. నారాయణరావు
6. ప్రకాశరావు
7. బి. ఆర్. పంతులు
8. ఎం. కే. రాధా
9. టి. ఆర్. రామచంద్రన్
10. ఎన్. టి. రామారావు
11. పి. రామశర్మ
12. కె. రఘురామయ్య
13. రేలంగి వెంకట్రామయ్య
14. శివరావు

తమిళంలో 1950 లో సెన్సారయిన చిత్రాలు 10. వీటిలో పాల్గొన్న పురుష తారలు 16 మంది, స్త్రీ తారలు 14 మంది జాబితాలో వున్నారు.

### బెంగాలీ చిత్రాల తమిళ తర్జుమాలు

బెంగాలు విభజన బెంగాలీ చిత్రాలపై బాగా దెబ్బతీసినతరవాత ఉత్తమబెంగాలీ చిత్రాలను ఇతరభాషలలోకూడా తీయాలన్న ఆలోచన బయలుదేరినట్లు కనిపిస్తుంది. ఈ ప్రయత్నంలో కొందరు తమిళ డిస్ట్రిబ్యూటర్లు బెంగాలీ నిర్మాతలకు తోడ్పడుతున్నారు. దీని ఫలితంగా "భైరవమంత్రం" "రత్నదీపం" అన్న చిత్రాలు త్వరలో తమిళంలో వెలువడనున్నాయి. మొదటిది అర్ధేందు చటర్జీ, రెండవది దేవకీ బోసు డైరెక్టు చేశారు.

"భైరవమంత్రం" ఈస్టర్న్ టాకీ సూడియోస్‌లో తమిళంలో తయారవుతోంది. దీనికి టి. ఎస్. కుమారస్వామి సంభాషణలూ, పాపనాశం శివన్ పాటలూ రాశారు. అయిలోర్ కృష్ణన్, లక్ష్మిరాణి పాటలు పాడుతున్నారు. ఈ చిత్రంలోని కథ ప్రాచీన తాంత్రికసంప్రదాయాలకు సంబంధించినది. ఈ చిత్రంలో ఒక తాంత్రికుడు బ్రహ్మాండమైన రాక్షసిని సృష్టించి, సాధనాలోపంచేత ఆ రాక్షసి వాతపడతాడు. ఈ చిత్రంలో శిశిర మిత్ర, అహిభట్టాచార్య, గురుదాస్ బెనర్జీ, ప్రీతిధర అనేనర్తకి మొదలైనవారు నటిస్తున్నారు.

"రత్నదీపం" అన్నకథ స్త్రీయొక్క అచంచలప్రేమగాథ. చిన్నతనంలో నే భర్త దేశాలు పట్టిపోయిన ఒక కన్య యుక్తవయస్కురాలైనపిమ్మట మరొకణ్ణి చూసి తనభర్త అని పొరపడుతుంది. ఆమె అచంచల ప్రేమ కామోసగాడు పవిత్రుడైపోయి తనకివ్వబడే శిక్షను హృదయపూర్వకంగా స్వీకరిస్తాడు. దేవకీబోసు తయారుచేసిన ఈ చిత్రంలో పహాడీసన్యాల్, అభిభట్టాచార్య, మొలినాదేవి, ఛాయాదేవి, మంజూదే (ఫొటో చూడండి) మొదలైనవారు నటించారు. ఈ చిత్రం తాలూకు తమిళ అనువాదంలో అయిలోర్ కృష్ణన్, లక్ష్మిరాణీ కాక, మొట్టమొదటిసారిగా జూతికారాయ్ సినిమాలో పాడుతోంది. ఈ చిత్రం న్యూథియేటర్స్ స్టూడియోలో తయారవుతోంది. దీనికి సంగీత దర్శకుడు రాబిన్ చటర్జీ.

ఈ రెండు చిత్రాల ప్రపంచ హక్కులు కినీభారత్ వారివి.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras

# శ్రీ శివానందాశ్రమం, హృషీకేశం

గంగాతీరానకల శ్రీ శివానంద సరస్వతివారి ఆశ్రమం. ఈ ఆశ్రమంనుంచి దివ్యజీవన సమాజంవారి పత్రిక లనేకం ప్రచురింపబడుతున్నవి.



శ్రీ విశ్వనాథ మందిరం



దివ్యజీవన సమాజ భవనం

ఛాయా చిత్రాలను పంపినవారు హృషీకేశ శ్రీ శివానందాశ్రమ వాసులైన స్వామి [illegible]